


సంపుటి: 6 సంచిక: 1 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. ఫిబ్రవరి 2020



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670, 9490180695

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:**

జి.వి. నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753 మరియు

రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వాణిజ్యం, మార్కెటింగు:** బి. అశోక్: 8074134544




# విషయ సూచిక






ముఖచిత్రం: **ప్రకృతి విజ్ఞానం!**
చిత్రకారుడు: **సి.రాము**

కొత్తపల్లి 107 వ పుస్తకం!




---

కేయూరాణి న భూషయంతి పురుషం హారా న చంద్రోజ్జ్వలా:
న స్నానం న విలేపనం న కుసుమం నాలంకృతా మూర్ధజా: ।
వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయంతే ఖిల భూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భూషలుగావు మర్త్యులకు భూరి మయాంగద తార హారముల్;
భూషిత కేశ పాశ మృదు పుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలు గావు; పూరుషుని భూషితు జేయు బవిత్ర వాణి- వా
గ్భూషణమే సుభూషణము; భూషణముల్ నశియించు నన్నియున్.

భావం: బంగారు కంకణాలు, చంద్రునిలాగా మెరిసే హారాలు, గొప్పవైన పన్నీటి స్నానాలు, శరీరానికి అలరుకునే చందనాలు, తలకు పెట్టుకునే పూలు- ఇవేవీ మనిషికి అసలు అలంకారాలు కావు. చక్కగా సంస్కరింపబడిన మాట తీరు ఒక్కటే మనిషికి అలంకారం. మిగిలినవన్నీ క్రమేణా క్షీణించిపోయేవే.

# చిలక పలుకులు

సంపాదకీయం

కడపజిల్లా, కలసపాడు మండలం, మాణిక్యమ్మ అవ్వ బలే కథ చెప్పింది . అనగనగా ఒక మంచాయన ఉండేవాడట. వాళ్ళ ఊరికి దగ్గర చాలా పండ్ల తోటలు ఉండేవి . పండ్లని తినేందుకు చిలకలు, వగైరా పక్షులు వచ్చేవి. అందుకని వాటిని పట్టుకునే వేటగాళ్లు కూడా చాలానే మంది తిరుగుతూ ఉండేవాళ్లు, ఆ ప్రాంతంలో.

మంచాయనకి ఎప్పుడూ ఈ చిలకల్ని చూసి జాలి వేసేది - "ఇంత ముద్దు ముద్దు చిలకలు, అన్యాయంగా వేటగాళ్ల పాలవుతున్నాయే!" అని బాధ పడగా పడగా, చివరికి ఆయనకు ఓ ఉపాయం తట్టింది. చిన్న వయసులో ఉన్న ఓ ఇరవై చిలుకల్ని పట్టుకొచ్చి, వాటికి ఈ పాట నేర్పించటం మొదలు పెట్టాడు శ్రద్ధగా :



"వేటగాడు వస్తాడు, జాగ్రత్త- దొరకద్దు!
వల విసురుతాడు, జాగ్రత్త- అటుపోకు!
గింజలు చల్లుతాడు, జాగ్రత్త- తినకు!
అసలు ఏమాత్రం ఆశపడకు!" అని.

చిట్టి చిలకలు అన్నీ ఆ పాటని బాగా నేర్చుకున్నాయి. ఏ కొంచెం ఖాళీ సమయం దొరికినా, అవన్నీ చక్కగా గొంతెత్తి పాడేవి- "వేటగాడు వస్తాడు, జాగ్రత్త. దొరకద్దు..." అంటూ.

ఇట్లా ఓ ఏడాది పాటు ట్రెయినింగ్ ఇచ్చాక, మంచాయన వాటిని అడవిలోకి తీసుకెళ్లి వదిలే–

సాడు. 'అక్కడ అవి ఎట్లా ఉంటాయో చూద్దాం' అని, వాటికి కనబడకుండా ఒక మూలన నక్కి కూర్చున్నాడు.



అంతలోనే అటుగా వచ్చాడు , ఒక వేటగాడు- గింజలు, బుట్టలు, వలలు అన్నీ పట్టుకొని వచ్చాడు . చెట్టు మీద వాలి ఉన్న చిలకల్ని చూసి చిరునవ్వు నవ్వాడు. అక్కడికి దగ్గర్లోనే వల పరచటం మొదలు పెట్టాడు. వెంటనే చెట్టుమీది చిలకలన్నీ ఒక్క గొంతుతో పాడటం మొదలు పెట్టాయి. "వేటగాడొస్తాడు, జాగ్రత్త! దొరకద్దు, జాగ్రత్త! వల విసురుతాడు, జాగ్రత్త! అటుపోకు! గింజలు చల్లుతాడు, జాగ్రత్త! తినకు! అసలు ఏమాత్రం ఆశపడకు!" అని.

అది వినగానే వేటగాడి ముఖం వాడి పోయింది. "అయ్యో! చేతికందే చిలుకలు చేజారినయ్యే! వీటికి నా గురించి అంతా తెలిసిపోయింది !" అనిపించి ఏడుపు వచ్చినంత పనైంది. నిరాశగా వాడు తన వలని ఎత్తేసి వేరే చోటికి పోబోయాడు.



అప్పటివరకూ పొదల చాటున కూర్చున్న మంచాయనకి వేటగాడి ముఖం చూసి నవ్వు వచ్చింది. 'తను చేసిన పని వల్ల ఇన్ని చిలుకలకు మేలు జరిగింది కదా !' అని కొంచెం గర్వంగా కూడా అనిపించింది.

మాటులోంచి బయటికి వచ్చి ఆయన వేటగా – డితో అన్నాడు: "ఇన్ని సంవత్సరాలుగా వీటి అజ్ఞానాన్ని ఆసరాగా చేసుకొని బ్రతికాం; ఇప్పుడు

వీటికి అసలు సంగతి తెలిసిపోయింది! ఇక ఇవి ఎవ్వరికీ దొరకవు- అయినా ఒక పని చెయ్యి. నీ దగ్గర ఉన్న కాసిని గింజలు కూడా చల్లెయ్యి. నాకు తెలిసి అవేవీ నీ వలలో పడవు; నువ్వు చల్లే గింజలు వృథానే అవుతాయి! అయినా చింతలేదు- నువ్వు వేసే శేరు గింజలకు గాను నేను నీకు నాలుగు శేర్ల గింజలు ఇస్తానులే, ఈ ఒక్కసారికి. నేను ఊళ్ళోనే ఉంటాను- తర్వాత నీకు వీలు కుదిరినప్పుడు ఎప్పుడైనా వచ్చి, గింజలు పట్టుకుపో!" అట్లా అని, ఆయన నవ్వు-కుంటూ ఇంటిదారి పట్టాడు.

వేటగాడు మరింత కృంగిపోయాడు. నిరాశతో వలని ఎత్తేయబోయిన వాడల్లా ఆగి, "సేరుకు నాలుగు సేర్లు గింజలు ఇస్తానంటున్నాడు కదా, ఈ మంచాయన? గింజలు చల్లే పోతానులే!" అని వలమీద అట్లా అట్లా కొన్ని గింజలు చల్లాడు-



అంతే- మరుక్షణం చిలకలన్నీ గబగబా ఎగురుకుంటూ వచ్చి వలమీద వాలాయి! ఆశగా గింజల్ని తినబోయాయి! అన్నీ వలలో చిక్కుకున్నాయి!

కొద్ది సేపు గందరగోళం తర్వాత అన్నీ వలలోంచే పాడసాగాయి : "వేటగాడు వస్తాడు జాగ్రత్త ... వల విసురతాడు. జాగ్రత్త,.. అటుపోకు..." అని!

వేటగాడు గింజలు ఇప్పించుకునేందుకు మంచాయన దగ్గరికి వెళ్ళి, ఏం జరిగిందో చెప్పాడు. చెప్పి చిలుకల్ని చూపించాడు మంచాయనకు. ఆయన నిర్ఘాంతపోయాడు: "నేను ఇన్ని జాగ్ర-త్తలు చెప్పానే; అవన్నీ వాటికి నోటికి వచ్చాయి కదా చక్కగా?! అయినా మరి వేటగాడికి ఎలా

చిక్కాయి?! నోటికి రావటం, నిజంగా తెలీటం రెండూ వేరా?" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

చాలాసార్లు మనమూ ఇట్లా చిలుకలలాగా ప్రవర్తిస్తాం. మనం నేర్చుకున్న సంగతులని ఎప్పటికప్పుడు మన జీవితాలకు అన్వయించుకోం. చిలుక పలుకులలాగా నేర్చుకొని మాటల్లో వెలువరించేవి ఎంత గొప్ప సంగతులైనా గానీ, రోజువారీ జీవితంలో మన ప్రవర్తనకు అంటలేదంటే, ఇక వాటివల్ల అంతిమంగా ఎలాంటి ప్రయోజనమూ ఉండదు.

నేర్చుకున్నదల్లా అప్లై చేసే మీకందరికీ అభినందనలతో,

కొత్తపల్లి బృందం

## ఇది కొత్తపల్లి 107 వ పుస్తకం!

గమనించారా? ఈ పుస్తకంలో చాలా కథలు పిల్లలు వ్రాసి పంపినవే. రెండు తెలుగు రాష్ట్రాలలోని పిల్లలూ అనేకమంది కథలు రాసి పంపారు. మరి ఈ కథలకు బొమ్మలు వేసినవాళ్ళు కూడా చాలా మంది పిల్లలే! ఈ బాల చిత్రకారులందరూ అనంతపురం రాధా స్కూలులో ఏడు, ఎనిమిది, తొమ్మిదో తరగతులు చదువుతున్నారు. అనుకుంటే మీరూ బొమ్మలు వేయగలరు, వేయించగలరు ; మీరూ కథలు రాయగలరు, రాయించగలరు!

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చువేసి, ఇష్ట పడిన వాళ్లకు అందించటం మాకు ఇష్టం. ఇప్పటి వరకూ వచ్చిన 107 పుస్తకాలలో 44 పుస్తకాల ప్రతులు మాత్రం మా దగ్గర లభిస్తున్నాయి ప్రస్తుతం. మిగిలిన వాటిని ఇంటర్నెట్లో చదువుకోవలసిందే.

ఈ పనులన్నీ ఎందుకు? ఎందుకంటే, ఇవి అందరికీ మేలు చేస్తాయి కాబట్టి. ఇట్లా అందరి మేలూ కోరి చేసే పనుల్లో మీ శక్తి కొద్దీ మీరూ పాలు పంచుకోండి. సాయం చేయండి, బాగా చదవండి. బాగా గీయండి. బాగా రాయండి. నవ్వండి. నవ్వించండి. ఆలోచించండి. చక్కగా పాడండి. మంచి పౌరులుగా ఎదగండి.

పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం- పిల్లలకూ, పెద్దలకూ అందరికీ!



# ఆహారపు అలవాట్లు

రెండు పేజీల కథ

*రచన: మౌనిక, పదో తరగతి, కస్తూర్బాగాంధీ బాలికా విద్యాలయం,ఝరాసంగం, మెదక్ జిల్లా, తెలంగాణ*

*మార్పు చేర్పులు : కొత్తపల్లి.*

ఒక చిలుక, ఒక కొంగ మంచి స్నేహితులు. ఒక రోజున వాటికి రెండింటికీ బాగా ఆకలి వేసింది.

"మనం చేపలు పట్టుకుని తిందాం " అన్నది కొంగ. కానీ చిలుకకు అది ఇష్టం లేదు . "మనం పండ్లు కొరుక్కొని తిందాం!" అన్నది చిలుక.

"చేపల్ని ఎందుకు తినకూడదు ?!" అంది కొంగ కోపంగా.

"అవి కూడా మనలాగే మూగజీవులు కదా " అన్నది చిలుక దయ చూపుతున్నట్లు.

"అయితే మనకేమిటి? మన ఆకలి తీరితే చాలు!" అన్నది కొంగ మొండిగా.

"సరే, చేపలు ఉన్నై కాబట్టి ఇట్లా అంటు – న్నావు, మరి చెరువు ఎండిపోతే ఏం చేస్తావు?!" అన్నది చిలుక.



"వేరే చెరువుకు వెళ్తాను!" అన్నది కొంగ.

"మరి అన్ని చెరువులూ ఎండిపోతే ఏం చేస్తావు?" అడిగింది చిలుక.

"అన్ని చెరువులూ ఎండిపోతే ఆకలితో చస్తాము అందరమూ!" అన్నది కొంగ.

"ఆ విధంగా ఆకలితో చనిపోయే బదులు పండ్లను తిని జీవిస్తే మేలు కదా !" అన్నది చిలుక నవ్వుతూ.

"బాగుంది, పండ్లు తిందామంటున్నావు గానీ, మరి చెట్లు ఎండిపోతే ఏం చేస్తావు ?" అడిగింది కొంగ.

"అదేం ప్రశ్న, చెట్లు అన్నీ ఎందుకు ఎండి – పోతాయి అసలు?" అన్నది చిలుక.

"అన్ని చెరువులూ ఎండిపోయినప్పుడు , చెట్లు అన్నీ కూడా ఎండిపోతై కదా ?!" అడిగింది కొంగ.

ఈ ఐడియా తనకి తట్టనందుకు తల పట్టుకున్న చిలుక- "మరెట్లా?" అంది.

"నీకు నచ్చింది నువ్వు తిను, నాకు నచ్చింది నేను తింటాను. ఒకరి తిండిని మరొకరం గౌరవిద్దాం. వీలైతే ఇద్దరం కలిసి కూర్చొని కబుర్లు చెప్పుకుంటూ తిందాం . లేదంటే తిన్నాక కబుర్లు చెప్పుకుందాం" అంది కొంగ నవ్వుతూ.




# అతి తెలివి

రెండు పేజీల కథ

*రచన: డి.రిషిత్, 6 వ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, విజయవాడ.*

ఓ ధనవంతుడికి తెలివితక్కువ కొడుకు ఒకడు ఉండేవాడు . ధనవంతుడికి తన కొడుకంటే చాలా ప్రేమ , వాడి తెలివితేటల మీద చాలా నమ్మకం. తన తర్వాత వ్యాపారాన్ని బాగా పెంచుతాడని ఆశ పడేవాడు.

కొడుకు వ్యాపారంలోకి వచ్చీ రాగానే "నేను ప్రపంచానికి అటు వైపున ఉన్న ఫలానా ద్వీపంతో వ్యాపారం చేస్తాను " అన్నాడు. "ఓడ నిండా సరుకులు తీసుకెళ్తాను; అక్కడినుండి వచ్చేప్పుడు విలువైన వస్తువులు తెచ్చి ఇక్కడ అమ్ముతాను!" అన్నాడు.

ధనవంతుడు సంతోషంగా ఒక ఓడను సిద్ధం చేసాడు. దాన్ని సరుకులతో నింపాడు . ఒక వంద కోట్ల రూపాయలు కూడా అందులో

ఉంచాడు. "ఆ ద్వీపం మీద బంగారం ధర తక్కువ, రాళ్ల ధర ఎక్కువ బాబూ! కాబట్టి నువ్వు తిరిగి వచ్చేటప్పుడు ఓడ నిండా మంచి బంగారాన్ని తీసుకురా" అని చెప్పాడు కొడుకుతో.

"నీకెందుకు నాన్నా, అంతా నా మీద వదిలెయ్యి! ఏవి మంచివో అవే తెస్తాను!" అన్నాడు కొడుకు, తండ్రి చెప్పేది ఏమీ వినకుండానే.

అతను ఆ ద్వీపానికి చేరుకుని, తన దగ్గరున్న సరుకులన్నీ మంచి లాభానికి అమ్మేసాడు . ఇక తిరిగి వస్తాడనగా , "ఇక్కడ ఏమేమి మంచి వస్తువులు ఉంటాయి?" అని వాకబు చేసాడు.

అక్కడ నిజంగానే బంగారం ధర తక్కువ ; రాళ్ల ధర ఎక్కువ . "బంగారుదేమున్నది, రాళ్లైతే చాలా మంచివి కదా ! " అన్నారు అక్కడి జనాలు . "అందుకనే రాళ్ల ఖరీదు ఎక్కువ చూడు- అవే విలువైనవి !"

"విలువైనవే తీసుకెళ్ళాలి " అనుకున్న కొడుకు, ఓడనిండా రాళ్లను వేసుకొని రాజ్యానికి తిరిగి వచ్చాడు . "అక్కడ ఉన్నవాటన్నిటిలోకీ ఇవే విలువైనవి . ఇవే రేటు ఎక్కువ" అని గర్వంగా చెప్పుకున్నాడు కూడా!

ఇది విన్న వ్యాపారి గుండె ఒక్కసారిగా ఆగినట్లైంది.

**జాగ్రఫీ నాలెడ్జి!**

టీచర్: మన ఊరికి ఇటువైపున దక్షిణం . మరి ఉత్తరం ఎటు ఉంటుందిరా, చింటూ?!

(చింటు ఒక వైపు చూపిస్తాడు.)

టీచర్: తప్పు బాబూ! ఉత్తరం ఉండేది ఇటు!

చంటి: కాదు టీచర్, మనం దక్షిణ ఇచ్చే గుడి ఉండేది ఇటు; మన ఉత్తరాలన్నీ తెచ్చి పెట్టే పోస్టాఫీసు ఉండేది అటు!




# భయపడిన దయ్యాలు

*రచన : ఆకాష్ కుమార్, 9 వ తరగతి, ఎ.పి.మోడల్ స్కూల్, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

*మార్పు చేర్పులు: కొత్తపల్లి.*

మారుతీపురంలో ఉండే ఆకాష్‌కి చాలా గుండె ధైర్యం. దేనికీ భయపడే వాడు కాదు.

ఒకసారి వాడు ఏదో పని పడి భీమాపురానికి బయలుదేరాడు. ఆ ఊరికి వెళ్ళే దారిలో ఒక చింత చెట్టు ఉంది. 'ఆ చెట్టులో ఒక దెయ్యం ఉంది' అని చెప్పుకునేవాళ్ళు. "పగటి పూట అది ఎవరినీ ఏమీ అనదు; కానీ రాత్రి పూట మాత్రం ఎవరైనా అటుగా వచ్చినట్లయితే వాళ్లని రకరకాలుగా భయపెట్టి పగలబడి నవ్వుతుంది" అనుకునేవాళ్ళు అంతా. ఎవరో ఆకాష్‌కు కూడా చెప్పారు ఆ సంగతి: "చీకటి పడేలోపు చింత చెట్టు దాటి పో" అని.

అయితే వీడు ధైర్యవంతుడుకదా , భయపడలేదు. చెట్ల కొమ్మలు నరికే కత్తితో పాటు కొన్ని సామానులను తన చేతి సంచిలో పెట్టుకొని , భీమాపురానికి బయలుదేరాడు. ఊరికి వెళ్ళి పని ముగించే సరికి సాయంత్రం అయింది.



"వెళ్ళొస్తాను ఇంక" అని మారుతీపురానికి బయలు దేరాడు వాడు. ఆ ఊళ్ళో వాళ్ళత్త "ఇప్పుడు, ఈ సమయంలో వద్దులేరా, రేపు ప్రొద్దున్నే వెళ్దువు. దారిలో చింతచెట్టు దగ్గర అల్లరి దెయ్యం ఉంది. దానితో నీకెందుకు?" అన్నది. కానీ మనవాడు దానికి భయపడ–లేదు. "నేను వెళ్లాల్సిందే" అని పంతం పట్టి, చీకటి పడుతుండగా తమ ఊరికి బయలు దేరాడు.

చింతచెట్టును చేరుకునే సరికి చీకటి పడుతున్నది. దయ్యం ఆకాష్ ని చూడగానే చెట్టు మీది నుండి క్రిందికి దూకింది . గబగబా ఆకాష్ ముందుకు వచ్చి నిలబడి , "హి హి హీ !" అని నవ్వింది. చీకటిలో దాని పళ్ళు మిలమిలా మెరిసాయి.

ఆకాష్ తన సంచీలో చెయ్యి పెట్టి పట్నంలో కొనుక్కొచ్చిన మాస్క్ ఒకదాన్ని బయటికి తీసాడు. అది బ్రహ్మరాక్షసుడి మాస్క్. వాడు ముఖానికి దాన్ని పెట్టుకొని , దయ్యం కంటే భయంకరంగా నవ్వాడు!

దయ్యం ఒకక్షణం బిత్తరపోయింది. అయినా తేరుకొని, తన చేతి గోళ్ళు ముందుకి చాచింది. వాడిగా, వంకరలు తిరిగి వెన్నెలలో మిలమిల మెరిసాయవి.

మనవాడు గబుక్కున సంచిలో చెయ్యి పెట్టి,

తను కొనుక్కున్న గ్లవ్స్ బయటికి తీసాడు . అవి ప్లాస్టిక్ గోర్లతో ఇంకా బాగా మెరిసాయి . వీడు వాటిని చేతులకు తగిలించుకొని , మరింత ధైర్యంగా దయ్యం వైపుకు నడిచాడు. "ఓలమ్మో! నిజం రాక్షసుడు !" అని అరుస్తూ దయ్యం వెనక్కి తిరిగి పరుగు పెట్ట సాగింది. వీడు తను తెచ్చుకున్న కత్తి పట్టుకొని దాని వెంట పడి , చివరికి దాని జుట్టు పట్టుకొని వెనక్కి లాగాడు!

ఆశ్చర్యం, దయ్యం జుట్టు పూర్తిగా ఊడి చేతులోకి వచ్చింది! "ఓలమ్మో! నా జుట్టు! నా జుట్టు పీక్కున్నాడు రాచ్చసుడు !" అని గట్టిగా అరిచిందది.

"ఎహె! రాచ్చసుడు లేదు , గీచ్చసుడు లేదు" అంటూ పొదల్లోంచి బయటికొచ్చిన మరొక దయ్యం, ఆకాష్‌ని చూడగానే కెవ్వున కేక పెట్టింది.

ఒక చేత్తో దయ్యం జుట్టును , మరొక చేత్తో కత్తిని చేత పట్టుకున్న ఆకాష్ వాటిని ఊపుతూ, ఇంకా బలంగా నవ్వుతూ "ఇప్పుడు దొరికినై దయ్యాలు ! మనుషుల్ని తినీ తినీ నాకు విసుగు పుట్టింది . ఇప్పుడు వీటిని తిని పండగ చేసుకుంటాను " అని అరిచాడు.

"అయ్యో! చమించు! మేం మడుసులమే! మమ్మల్ని వదిలెయ్యి " అంటూ కాళ్ల మీద పడ్డాయి ఆ దయ్యాలు రెండూ.




ఆకాష్ ఒక్క క్షణం బిత్తర పోయాడు. అయితే వెంటనే తేరుకొని "మడుసులైతే దయ్యాల వేసం వేసినారు ఎందుకురా ?!"

అని అరిచాడు.

"మా మడుసులు ఇక్కడ నిదులకోసం తవ్వుతున్నారు సోమీ, నడి రేత్తిరి వరకూ పని నడుస్తాది. అందుకని ఇక్కడికి వేరే ఎవ్వరూ రాకుండా మేం ఇట్టా వేసం వేసి – నాం" చెప్పింది ఒక దయ్యం, ఏడుస్తూ.

"నేను ఆ నిధులకు కాపలాగా వచ్చిన కొత్త రాక్షసుడిని. మర్యాదగా ఇక్కడినుండి పోయారా, సరే సరి. లేకపోతే రేపు రాత్రి మిమ్మల్ని అందరినీ కాల్చుకొని తింటాను "

అని వాటిని బెదిరించి, పొదల్లోకి తరిమి, తన దారిన తాను చక్కా పోయాడు ఆకాష్.

తర్వాతి రోజున "పోలీసులను వెంటబెట్టు–కొని అక్కడంతా తిరుగుదామా " అనుకు–న్నాడు గానీ, "అంత అవసరం ఉండదు " అని ఆగిపోయాడు వాడు. అయితే వాడి మంత్రం పని చేసినట్లుంది. ఆరోజునుండి అక్కడ ఎవ్వరికీ ఇక దయ్యం కనిపించలేదు. జనాలు ఆ దారిన నిర్భయంగా తిరగసా–గారు.

మానవుడాత్మకిష్టమగు మంచి బ్రయోజన మాచరించుచో
గానక యల్పుడొక్కడది గాదని పల్కిన వాని పల్కుకే
మానగ జూడడాపని! సమంచిత భోజన వేళ నీగ కా
లూనిన వంటకంబు దినకుండగ నేర్పగునోయి, భాస్కరా?

మనం మన ఆత్మకు ఇష్టం అయ్యే ఏదైనా మంచి పనిని చేసేందుకు నడుం బిగించినప్పుడు, దాని లోతు తెలుసుకోలేక ఎవరైనా మూర్ఖుడు ఆ పనిని తీసి పారేస్తూ మాట్లాడితే కూడా మనం ఆ పనిని మానెయ్యకూడదు. అద్భుతమైన భోజనం చేసేందుకు కూర్చున్నప్పుడు ఒక ఈగ వచ్చి కాలు పెట్టిందని ఆ వంటకాన్ని తినకుండా మానెయ్యటం తెలివైన పని అవుతుందా, భాస్కరా?




# బిర్యానీ కలలు

జానపద కథ

*సేకరణ, పున:కథనం : కె.హేమంత్, 9 వ తరగతి, ఎ.పి. మోడల్ స్కూల్, సికే పల్లి, అనంతపురం జిల్లా.*

అనగనగా ఒక ఊళ్లో రాజు, సోము, చంద్రం అనే ముగ్గురు పేదవాళ్ళు ఉండేవాళ్ళు.

ముగ్గురూ తలా ఒక దిక్కుకు వెళ్ళి, ఏ పని దొరికితే ఆ పని చేసేవాళ్ళు. ఏ పనీ దొరక్క-పోతే అడుక్కునేవాళ్ళు.

ఏ రోజుకు సరిపడ ఆహారపు దినుసులు ఆరోజు కొనుక్కుని వంట చేసుకునేవాళ్ళు. వంట పూర్తయ్యేసరికి ముగ్గురి కడుపులూ నకనకలాడుతూ ఉండేవి. చకచకా తినేసి, ఎవరి లోకాల్లో వాళ్ళు విహరించేవాళ్ళు.

ఒకసారి వాళ్లకి బిర్యానీ తినాలనిపించింది. "జీవితంలో ఒకసారైనా బిర్యానీ కడుపు-నిండా తినాలిరా, ఎప్పుడూ ఈ చార్లతో ఏమౌతుంది?" అనుకున్నారు.

కానీ, బిర్యానీ అంటే కొంచెం ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. వాళ్ల దగ్గర డబ్బులు ఏనాడూ నిలవ ఉండవు- వచ్చిన డబ్బులన్నీ ఏపూటకాపూట ఖర్చయ్యేవి. బిర్యానీ తినా-లంటే అదనపు డబ్బులు కావాలి...



"ఇంకెప్పుడు, బిర్యానీ తినేది?" అని ఆరోజు రాత్రంతా విచారపడితే, వాళ్లకి ఒక ఆలోచన తట్టింది: "రోజూ తాము తెచ్చే డబ్బుల్లో తలా ఒక రూపాయీ అసలు రాలేదనుకో-వాలి. ఆ రూపాయిలని అంతా ఒక చెంబులో వేసి, కూడబెట్టాలి. చివరికి బిర్యానీ తినే రోజున ఈ అదనపు డబ్బుల్ని వాడుకోవాలి!

కొన్ని రోజులపాటు అట్లా కడుపులు కాల్చు-కొని, కూడబెట్టుకున్న డబ్బులతో సంతకు వెళ్ళి, బిర్యానీకి కావలసిన బియ్యం , కూరగాయలు, మాంసం, మసాలాదిను-సులు, నూనె వగైరాలు అన్నీ తెచ్చుకున్నారు ముగ్గురూ.

ఆ రోజు సాయంత్రం "బిర్యానీ!" అనే ఉత్సాహం కొద్దీ ముగ్గురూ రోజంతా ఉపవా-సమే ఉన్నారు కూడా ! సాయంత్రం 'చీకటి పడుతోంది' అనగానే ముగ్గురూ కలిసి ఇష్టంగా బిర్యానీ వండటం మొదలు పెట్టారు. అన్ని దినుసులూ ఉండటంతో ఘుమఘు -మలాడే బిర్యానీ తయారయింది . ఆ సరికి బాగా చీకటైంది కూడా.

ఇక ముగ్గురూ తట్టలు ముందు పెట్టుకొని కూర్చున్నారు. చాలా మెల్లగా రాజు బిర్యానీ మీది మూత తీసి చూసాడు. "సూపర్! బలే ఉంది వాసన!" అన్నాడు. అయితే అందులో

ఉన్న బిర్యానీ చాలా కొంచెమే . వీళ్ళ లెక్క తప్పి, ముగ్గురికి అవ్వాల్సిన బిర్యానీ ఒక్కడికి కూడా చాలీ చాలనంత కొంచెం అయ్యింది.

"ఒరే, ఇంత కొంచెం బిర్యానీ అయిందే – మిరా?" అన్నాడు రాజు.

"ఎంతైతేనేమి, ముగ్గురం పంచుకుని తిందాం!" అన్నాడు సోము.

"నేనైతే మొత్తం ఒక్కడినే తినగలను !" అన్నాడు చంద్రం.

"మేం కూడా తినగలం !" అన్నారు రాజు, సోము ఒక్కగొంతుతో.

"చూడండి, ఇవాళ్ళ మనలో ఎవరమో ఒకరం మాత్రం మొత్తం బిర్యానీ తినేద్దాం . వచ్చే వారం మళ్ళీ చేసుకుందాం , ఈసారి ఎక్కువ మొత్తంలో చేసుకొని , మిగిలిన ఇద్దరూ తింటారు" అన్నాడు సోము.

"సరే, ఇన్నాళ్లనుండి బిర్యానీ గురించి కల కంటున్నాను కాబట్టి, దీన్ని నేను తింటాను ఇవాల్టికి" అన్నాడు రాజు. "కాదులే, నేను నీకంటే గొప్ప కలలు కంటున్నాను . నేను తింటా" అన్నాడు సోము. అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"చూడండి, ఇక లాభం లేదు . బాగా ఆలస్యం కూడా అయ్యింది . మనం ముగ్గురం తలా ఒక గ్లాసెడు మంచినీళ్ళు త్రాగి, ఈ బిర్యానీ గిన్నె చుట్టూనే పడుకుం–దాం. అందరం రేపు ఉదయం వరకూ మంచి మంచి బిర్యానీ కలలు కందాం. ఎవరికి అతి గొప్ప కల వస్తుందో, వాళ్ళదే ఈ బిర్యానీ!" తీర్పు చెప్పాడు చంద్రం.

మిగిలిన ఇద్దరికీ పౌరుషం హెచ్చింది . "సరే-అలాగే కానీ " అన్నారు. ఇక ముగ్గురూ గబగబా ముసుగు తన్ని బిర్యానీ గిన్నె చుట్టూ పడుకున్నారు.

ఇంకా తెల్లవారకనే రాజు మిగిలిన ఇద్దరినీ నిద్రలేపాడు: "నాకు ఎంత మంచి కల వచ్చిందో తెలుసా ? నేను విమానం ఎక్కి

హైదరాబాదుకు వెళ్ళానట! అక్కడ ఒక పెద్ద హోటల్లో ముఖ్యమంత్రిగారితో కలిసి బిర్యానీతో పాటు రొట్టెలు , కూరలు తిన్నానట!" అన్నాడు.

సోము గట్టిగా నవ్వి "అయ్యో అన్నా! నాకు నీకంటే గొప్ప కల వచ్చింది . మా ఇంటి దేవుడు నన్ను నేరుగా స్వర్గలోకం పిల్చుకుపోయాడు. అక్కడ నేను, ఆయన కలిసి డిన్నర్ చేసాం . దేవకన్యలు వడ్డించారు . బిర్యానీ ,స్వీట్స్, ఇంకా ఏమేమి తిన్నామో లెక్కలేదు!" అన్నాడు గొప్పగా.

చంద్రం ఇంకా నోరు విప్పలేదు . విచారంగా తల వంచుకొని కూర్చొని ఉన్నాడు. ఇద్దరూ వాడికేసి చూసి,"ఏరా, అట్లా కూర్చున్నావు? నీకేమీ బిర్యానీ కల రాలేదా?" అన్నారు.

"లేదురా! ఇప్పటి వరకూ మీకు నా కల గురించి ఎలా చెప్పాలా అని బాధ పడుతున్నాను. ఇప్పుడు చెప్పచ్చు: ఎలాగూ మీరు కడుపునిండా గొప్ప గొప్ప వంటకాలు తిని ఉన్నారు" అన్నాడు.

"ఏమైంది?" అన్నారు మిగిలిన ఇద్దరూ ఆదుర్దాగా.



"నిన్న రాత్రి నా కలలోకి ఒక భయంకరమైన రాక్షసుడు ఒకడు వచ్చాడురా ! 'ఆకలి! ఆకలి!' అని అరిచాడు. 'ఏముంది, పెట్టు!' అన్నాడు! 'బిర్యానీ ఉంది తింటావా ?!' అన్నాను నేను. వాడు నాకేసి అనుమానంగా చూసాడు. 'అడగ్గానే తినమంటున్నావు , అందులో ఏం కలిపావు ?' అన్నాడు. 'ఏమీ లేదు!' అన్నాను నేను. వాడు దాన్ని వాసన

చూసి, 'తిను!' అన్నాడు. నేను 'తినను!' అని మొండికేసాను. నేను 'తినను' అన్నకొద్దీ వాడికి కోపం ఎక్కువైంది . "నువ్వు బిర్యానీ తింటావా లేక నేను నిన్ను తినాలా ?" అని బెదిరించాడు. దాంతో ఇక భయం వేసి , బిర్యానీ మొత్తం తినేసాను !" అన్నాడు చంద్రం.

"అప్పుడు మమ్మల్ని లేపి ఉంటేనేమిరా ?!" అన్నారు రాజు , సోము- వాడి మీద జాలి పడుతున్నట్లు.

"మీలో ఒకరు అప్పుడు ముఖ్యమంత్రితోను , మరొకరు దేవుడితోనూ బిర్యానీ తింటు – న్నారు. మిమ్మల్ని ఎందుకు డిస్టర్బ్ చేయాలి, అని, మిమ్మల్ని లేపలేదు!" అన్నాడు చంద్రం.

అసలు సంగతి అప్పుడు వెలిగిన మిత్రులి – ద్దరూ గబగబా గిన్నె దగ్గరికి వెళ్ళి చూస్తే ఏముంది? గిన్నె మొత్తం ఖాళీ ! ఒక్క మెతుకు బిర్యానీ కూడా లేదు! ★

**రహస్య సమాచారం!**

నవ్వు!

సీనా : ఉత్తరం పై చిరునామా రాయకుండానే పోస్ట్ బాక్స్ లో వేశావేం?!

రాము : ష్... ఎవరికీ తెలియకుండా రహస్యంగా పంపుతున్న ఉత్తరంరా అది!

**అభినవ ఏకలవ్యులు!**

టీచర్ : ఏకలవ్యుడికి , మీకు తేడా ఏంట్రా చింటూ?"

చింటూ : మేము వేలుపోసి చదువుకుంటున్నాం'; ఏకలవ్యుడు వేలుకోసి చదువుకున్నాడు సార్!

**ఇంట్లోనే బ్యాంకు!**

బుక్ సెల్లర్ ఒకాయన సర్వే నిర్వహిస్తున్నాడు:

బుక్ సెల్లర్ : మిమ్మల్ని జీవితంలో బాగా పైకి తీసుకొచ్చిన బుక్ ఏది?

సూర్యం : మా ఆవిడ చెక్ బుక్.




# పిల్లలు-పెద్దలు

*రచన: రేవతి, 9 వ తరగతి, తేజా విద్యాలయ, కోదాడ*

అమరవరంలో ఒకప్పుడు గోపి అనే పిల్ల – వాడు ఉండేవాడు. వాళ్ళ అమ్మ-నాన్నలు రైతులు. ఒకప్పుడు బాగానే బ్రతికినా, కాలం గడిచేకొద్దీ చితికిపోయి, తమకున్న ఆస్తులు అమ్ముకొని పట్నం చేరుకున్నారు . గోపిని తమకు ఉన్నంతలో బాగా చదివించారు.

గోపికి తమ ఇంటి పరిస్థితులు అన్నీ తెలుసు. తనను చదివించటం కోసం అమ్మ -నాన్న పడిన శ్రమ, ఎదుర్కొన్న కష్టాలు అన్నీ తెలుసు. "వాళ్ళను మంచిగా చూసుకోవాలి" అని అనుకునేవాడు కూడా.

కాలక్రమంలో గోపికి పట్నంలోనే ఓ చిన్న ఉద్యోగం దొరికింది. ఇప్పుడు అతని జీతం– తోటే ఇల్లు నడుస్తున్నది.

కొన్ని రోజులకు అతనికి పెళ్ళి అయింది . భార్య రాధది తమలాగే పట్నానికి వలస వచ్చిన మధ్య తరగతి కుటుంబం . తర్వాత మెల్లగా కష్టాలు మొదలయ్యాయి . గోపి సంపాదించే కాసిని డబ్బులతో ఇల్లు గడవడం కష్టం అవ్వసాగింది.

అంతలోనే వాళ్ళకు ఒక కొడుకు పుట్టాడు . ఖర్చులు మరింత పెరిగాయి . గోపి-రాధ ఇద్దరూ 'ఇల్లు గడిచేది ఎలాగ , డబ్బులు సంపాదించేది ఎలాగ ?' అని ఆలోచనలో పడ్డారు.

రాధ అన్నది- "నేను పెద్దగా చదువు కోలేదు; కాబట్టి నాకు సంపాదించే అవకాశం కూడా లేదు. పైగా పిల్లవాడున్నాడు . అందుకని నువ్వే వేరే ఏదైనా పార్ట్ టైం ఉద్యోగం చూసుకో. అదనపు డబ్బు లేకపోతే ఇల్లు గడవదు" అని.

"సరే- అట్లాగే చేస్తాను.. కానీ మా అమ్మా –నాన్నల బరువు కొద్దిగా నీ మీద పడుతుం –దేమో- వాళ్లు పెద్దవాళ్లయిపోయారు, కళ్ళు కనబడవు, చెవులు వినబడవు !" అన్నాడు గోపి.

రాధకి ఆ అదనపు పని ఇష్టం కాలేదు . కానీ చేసేదేమీ లేదు. అందుకని మౌనంగా ఉన్నది.



మళ్ళీ గోపినే "నేను వేరే పార్ట్ టైం ఉద్యోగా–లకు కూడా ప్రయత్నం చేస్తాను రాధా . ఏమంటే పార్ట్ టైం పనులకు జీతం మటుకు చాలా తక్కువ ఇస్తారు . మనం ఏమీ చెయ్యలేం" అన్నాడు గోపి. అలా ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

మరుసటిరోజు ఉదయం గోపి 'ఏం చేయాలి' అని ఆలోచిస్తూ ఆఫీసూ పోతుంటే, దారిలో 'వృద్ధాశ్రమం' ఒకటి కనిపించింది. అది రోజూ అక్కడ ఉండేదే, కానీ ఇప్పుడు దాన్ని చూడగానే తన "సమస్యలకు అన్నిటికీ ఇది పరిష్కారం" అనిపించింది అతనికి.

"అమ్మ నాన్నలను వృద్దాశ్రమంలో వేయాలి - 'డబ్బులు ఖర్చు' అని చూసుకోకూడదు".




ఆ రోజు రాత్రి గోపి రాధ ఇద్దరూ చర్చించుకొని, సరేననుకున్నారు.

మరుసటి రోజు వాళ్ళ అమ్మ నాన్నలను గుడికి తీసుకొని వెళ్తానని చెప్పి , వృద్ధాశ్రమానికి తీసుకొని వెళ్ళాడు గోపి . అయినా పాపం వాళ్లకు కొడుకు ఉద్దేశం అర్థం కాలేదు. కళ్ళు తెరిచే సరికి గోపి వాళ్ళిద్దరినీ అందులో చేర్పించి వెళ్లిపోయాడు.

కొడుకు మళ్ళీ వస్తాడు-తమని తీసుకెళ్తాడు" అనే ఆలోచనలో వాళ్ల అమ్మ-నాన్నలు అక్కడే ఉండిపోయారు. కొద్ది కాలానికి వాళ్ళ కళ్ళు యితే తెరచుకున్నాయి కానీ , కొడుకు మటుకు కంటపడలేదు.

కష్టాలు ఎల్లకాలమూ ఉండవు కదా , గోపి కుటుంబ కలతలు సద్దుమణిగాయి . కొడుకు రాజు చూస్తూ ఉండగానే పెద్దవాడు అయ్యాడు. వాడి చదువు పూర్తయింది . అమెరికాలో ఉద్యోగం కూడా వచ్చింది . వాడు అమెరికా వెళ్ళి మంచిగా డబ్బులు సంపాదించాడు.

"మీరు కూడా అక్కడి ఆస్తులు అవీ వదిలేసి, ఇటు వచ్చేయండి " అంటూ ఉండేవాడు

కాస్తా, తనకి పెళ్లయ్యే సరికి రాగం మార్చే – సాడు: "నేను ఇక్కడ సొంతగా ఓ కంపెనీ పెట్టాలి నాన్నా! నీకు తెలుసుగా, కంపెనీ అంటే ఊరికే రాదు. అక్కడ ఇండియా ఉన్న మన ఆస్తులు అవీ అమ్మి, ఆ డబ్బులు అమెరికాకి పంపించండి" అన్నాడు.

"అట్లా ఎట్లా కుదురుతుందిరా ? ఆస్తులు అన్నీ అమ్మేస్తే, మరింక మీ అమ్మ -నేను ఎక్కడ ఉండాలి?" అన్నాడు గోపి ఆందోళన చెందుతూ.

"ఏముంది, మీ అమ్మ నాన్నలను చేర్పించా – వుగా నాన్నా! అదే వృద్ధాశ్రమానికి మీరు కూడా వెళ్లచ్చు. నేను వాళ్లతో అల్రెడీ మాట్లాడేసాను. మిమ్మల్ని కూడా చేర్చు – కుంటామన్నారు!" అన్నాడు రాజు.

గోపి-రాధలకు నోట మాట రాలేదు! వాళ్లకు ఆ రోజున అర్థమయింది: "చేసిన తప్పే వెంటాడి వేధిస్తుంది".

**దాత!**

రవి : మమ్మీ ... బయట ఒకాయన ఎండలో నిల్చుని అరుస్తుంటే పది రూపాయలు ఇచ్చాను..

అమ్మ : మంచిపని చేశావురా! ఇంతకీ ఏమని అరిచాడు అతను?!

రవి : ఐస్క్రీం.. ఐస్క్రీం. ఐస్క్రీం..అని.

నవ్వు!

**నల్ల టిక్కెట్లు!**

ఇన్స్పెక్టర్ : బ్లాక్‌లో టికెట్లు అమ్మేవాడిని పట్టుకు రమ్మంటే ఒక్కడివే వచ్చావే?

కానిస్టేబుల్ : అక్కడ టికెట్లు ఏవీ బ్లాక్‌లో లేవు ... పసుపు, గులాబీ రంగుల్లో ఉన్నాయి సార్.

**సిగ్గా-ఎగ్గా?**

సార్: ఎప్పుడూ ఏదో ఒక తప్పుచేసి క్లాసులో నిలబడి ఉంటావు, సిగ్గనిపించదా, రాజూ?!

రాజు: లేదు సార్! అసలైతే క్లాసు మొత్తానికీ మనిమిద్దరమే నిలబడి ఉంటామని గర్వంగా ఉంటుంది!



# చింటూ-కుక్క

సాహసం

*రచన: పల్లా నిఖిల, 9 వ తరగతి, తేజ విద్యాలయ, కొమరబండ.*

హుస్నాబాదులో చింటు అనే పిల్లవాడు ఉండేవాడు. వాడికి మనుషుల కంటే జంతువులంటేనే చాలా ఇష్టం.

ఒకరోజున వాడు బడినుండి ఇంటికి వస్తుంటే చిన్న కుక్క పిల్ల ఒకటి కనిపించింది. అది 'కుయ్-కుయ్' మనుకుంటూ ఆ వీధిలో అందరి ఇళ్ళలోకీ వెళ్తోంది; ఎవరింటికి వెళ్ళినా, కొద్ది సేపటికి వాళ్ళు దానిని చూడటం, బయటికి తరమటం!

'వాళ్ళ అమ్మ ఏమైనా దగ్గర్లో ఉందా ?!' అని శ్రద్ధగా ఒక అర్థగంట సేపు అక్కడే నిలబడి చూసాడు చింటూ. పెద్ద కుక్కలు ఏవీ ఆ దరిదాపుల్లో లేవు.

దాంతో వాడికి ధైర్యం వచ్చి, దాని దగ్గరికి వెళ్ళి

దాన్ని ఎత్తుకున్నాడు.

అది 'కుయ్ కుయ్; మనటం ఆపి, నాలుక బయట పెట్టి వాడిని నాకేందుకు ప్రయత్నించింది. చింటు దాని వీపును కొద్ది సేపు నిమిరి, వదిలేద్దామనుకున్నాడు, కానీ చేతులు రాలేదు. చివరికి దాన్ని ఎత్తుకొని ఇంటికి తీసుకెళ్ళాడు వాడు.



చింటూ వాళ్లమ్మ కుక్క పిల్లని చూడగానే కెవ్వుమని అరిచి, చింటూని ఇష్టం వచ్చినట్లు తిట్టి, "బట్టలు మార్చుకొని చేతులు సబ్బుతో కడుక్కో పోరా!" అని అరిచింది. "అది ఈ ఇంట్లోకి రావటానికి లేదు. ఇన్ని పనులున్నై; ఇంకా దానికి కూడా వండి వార్చాలంటే నావల్ల కాదు!" అన్నది.

ఇంకొంత సేపటికి వచ్చిన చింటూ వాళ్ళ నాన్న కుక్కపిల్లని చూడగానే పులిని చూసినట్లు భయపడ్డాడు: "ఇదిగో అబ్బాయీ! నువ్వు దీన్ని ఎక్కడికి పంపుతావో పంపించు, ఇది మాత్రం ఇక్కడ మా పరువులెక్కి తిరిగే వీలు లేదు అంతే!" అని తిట్లు లంకించుకున్నారు.

"ఇప్పుడు ఏం చేయాలి దీన్ని?!" అనుకుని, ఆ కుక్కని ఎత్తుకుని ఇంటి బయటికి వచ్చాడు చింటూ. దాన్ని పంపనూ లేడు; ఉంచుకోనూ లేడు! చివరికి వాళ్ళ ఇంటి సరిహద్దు గోడకు ఆనించి దాని కోసం ఒక చిన్న ఇల్లు కట్టాడు. వాళ్ల అమ్మా నాన్నాఏమైనా అంటారేమో అని చూసాడు కానీ వాళ్ళు ఏమీ అనలేదు.

మొదట్లో అమ్మ తనకోసం పోసే పాలలోంచే

కొన్ని దానికి పోసాడు వాడు . అది చూసి ఇంట్లో వాళ్ళు విసుక్కుని , కొన్ని పాలు తామే ఇవ్వటం మొదలు పెట్టారు.

అట్లా కొన్ని రోజులు గడిచాక , అది ఇంట్లో వాళ్ళు వదిలేసిన కూరల్ని, అన్నం మెతుకుల్ని కూడా తినసాగింది . ఇప్పుడిప్పుడే చింటూ వాళ్ల అమ్మ కూడా దానికి కొంచెం కొంచెం అన్నం పెడుతోంది . దాని మెడలో ఒక గొలుసు వేసి, రోజూ దాన్ని బయట త్రిప్పు – కొచ్చేవాడు చింటూ . ఇంట్లోకి రాగానే మటుకు గొలుసు విప్పేసేవాడు.

చింటూ బడికి పోతుంటే కుక్కపిల్ల 'కుయ్ కుయ్' మంటూ వాడి వెంట పడేది. వాడితో పాటు కొంచెం దూరం వెళ్లి , వాడు గదిమితే వెనక్కి వచ్చేసేది.

తన కుక్కపిల్లని బడిలో పిల్లలకు అందరికీ చూపించాలని చింటూకి బాగా కోరికగా ఉండేది, కానీ అమ్మ -నాన్న దాన్ని బడికి తీసుకెళ్ళనిచ్చేవాళ్ళు కారు . "మీ టీచర్లు ఊరుకోరు. అయినా అసలు నీకు ఒక్కడి – కేనా కుక్కపిల్ల ఉన్నది ? వాళ్లెవ్వరూ తమ కుక్కల్ని బడికి పట్టుకొని రారెందుకు ?" అనేవాళ్ళు.

ఒక రోజు సాయంత్రం అయింది - చింటూ ఇంకా బడినుండి రాలేదు.



చింటూ వాళ్ల అమ్మ ఆందోళనగా మాటి మాటికి గేటు దగ్గరికి వచ్చి చూసి వెళ్తున్నది . గేటు గడియ వేసి లేదు. కొంచెంసేపు దాని – వైపే చూసాక, కుక్క చకచకా లేచి , తలుపు సందు చేసుకొని బయటికి పరుగు పెట్టింది.

చింటూ వాళ్ల బడి ఎక్కడుందో దానికి తెలుసు. చింటూ వాసన పట్టుకొని రోడ్ల వెంబడి పరుగెత్తుకుంటూ పోయిందది . అక్కడ ఒక చోట తుప్పల్లో కనబడింది , చింటూ పుస్తకాల బ్యాగు!

కుక్కపిల్ల పోయి, ఆ బ్యాగు వాసన చూసి, 'అది చింటూదే ' అని కనుక్కున్నది . ఆ తర్వాత వాసన చూసుకుంటూ తుప్పల వెంబడి ఉన్న కాలి బాటలో ముందుకు పోయి, ఎక్కడో ఓ కాలవ చివరన ఉన్న పాడుబడ్డ భవనం చేరుకున్నది.

చింటూ అందులోనే ఉన్నాడని దానికి తెలుసు. అది గబగబా ఆ భవంతిలోకి పోబోయింది. అయితే అక్కడ ఎవరో ఇద్దరు మీసాల వాళ్ళున్నారు. వాళ్ళు ఈ కుక్కపిల్లని అదిలించి, కట్టె పట్టుకొని తరిమారు!

కుక్కపిల్ల చాలా తెలివైనది . అది ఇంక లోపలికి దూరే ప్రయత్నం చెయ్యలేదు . వెనక్కి తిరిగి గబగబా చింటూ వాళ్ళ ఇంటికి పరుగు పెట్టింది.

బడినుండి వస్తుంటే ఈ ఇద్దరు దొంగలూ చింటూని కిడ్నాప్ చేసారనమాట ! కుక్కపిల్ల ఇల్లు చేరుకునేలోగా కిడ్నాపర్లు చింటూ వాళ్ళ అమ్మ నాన్నలకు ఫోన్ చేసారు. "మేం చెప్పిన సొమ్ము ఇవ్వకపోతే ఇంక చింటూని మీ ఇంటికి పంపించం" అని!

అంతలో కుక్కపిల్ల పరుగెత్తుకుంటూ వచ్చి చింటూ వాళ్ళ నాన్న అంగీ పట్టుకొని లాగ - సాగింది. ముందు ఆయన "ఛీ ఛీ! వదులు!" అని అరిచాడు గానీ, కుక్కపిల్ల వదలకపోయే సరికి ఆలోచన వచ్చింది - 'ఇది ఎక్కడికో రమ్మంటోంది' అని.

వెంటనే ఆయన ఇరుగు పొరుగు వాళ్లని వెంటబెట్టుకొని కుక్క పిల్ల వెంట వెళ్లాడు . అక్కడ తుప్పల్లో చింటూ బ్యాగు చూడగానే, వాళ్లంతా పోలీసులకు ఫోన్ చేశారు.

వాళ్ళు చెప్పిన గుర్తుల్ని పట్టుకొని అక్కడికి చేరుకున్న పోలీసులు, భవనాన్ని చుట్టుము–

ట్టి, దొంగలిద్దరినీ తెలివిగా బంధించారు . చింటూని విడిపించి, వాళ్ళ అమ్మనాన్నలకు అప్పజెప్పారు.

ఆ దొంగలిద్దరూ అంతర్రాష్ట్ర దొంగల ముఠా వారట! ఇప్పటికే ఎంతో మంది పిల్లల్ని కిడ్నాప్ చేసారట వాళ్ళు. కుక్కపిల్ల తెలివి – తేటల మూలాన ఇప్పుడు వాళ్ళ నాటకానికి తెరపడింది.

కుక్కపిల్లని పోలీసులతో సహా ఊళ్ళోవాళ్లంతా చాలా మెచ్చుకున్నారు. చింటూ వాళ్ల అమ్మ-నాన్నలు కూడా అప్పటి నుండి కుక్కని రెండో కొడుకులాగా చూసుకోసాగారు.

ఇప్పుడు కుక్క కూడా రోజూ చింటూతో పాటు బడికి వెళ్తున్నది!



తనవారు లేని చోటను
చనవించుక లేని చోట, జగడము చోటన్
అనుమానమైన చోటను
మనుజునకు నిలువదగదు మహిలో సుమతీ!

తనవారంటూ ఎవరూ లేని చోట, తనకు చనువు లేని చోట, పోట్లాటలు అయ్యే చోట, అనుమానంగా అనిపించే చోట మనం ఉండీ ప్రయోజనం లేదు.

కులకాంతతోడనెప్పుడు
కలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠి కంట కన్నీ
రొలికిన సిరి యింటనుండనొల్లదు సుమతీ

భార్యతో ఎప్పుడూ పోట్లాడకు. దోషాలు ఎంచి చూపి ఏడిపించకు. ఇంటావిడ కంట్లోంచి ఏ ఇంట్లో అయితే నీరు ఒలుకుతుందో, ఆ ఇంట్లో సంపద నిలవదు.

ఓడల బండ్లును వచ్చును
ఓడలునా బండ్లమీద నొప్పుగ వచ్చున్
ఓడలు బండ్లును వలెనే
వాడంబడు గలిమి లేమి వసుధను సుమతీ!

బండ్లు ఓడలనెక్కి వస్తాయి; ఓడలు కూడా ఆ బండ్ల మీద ఎక్కి వస్తుంటాయి. ఓడలు, బండ్ల మాదిరే ఒకదానినొకటి ఎక్కి వస్తాయి కలిమి-లేములు. ఇది అసామాన్యం ఏమీ కాదు!




# డాల్ఫిన్ కథ

సాహసం

*రచన: హర్షవర్ధన్, 8 వ తరగతి, తేజావిద్యాలయ, కోదాడ, నల్గొండ జిల్లా, తెలంగాణ.*

గోవాలో ఉండే శ్రీర్ధన్‌కు చాలా బలం , ధైర్య సాహసాలు ఉండేవి . వాడికి బాడీబిల్డింగ్ అన్నా, వ్యాయామం, సముద్రంలో ఈత , సర్ఫింగ్ మొదలైన ఆటలు, సాహసక్రీడలన్నా చాలా ఇష్టం.

ఒకసారి వాడు , వాడి మిత్రులు అంతా తరగతి గదిలోనే సమావేశం పెట్టి , "ఈ సంవత్సరం విహారయాత్రకు అండమాన్ నికోబార్ దీవులకు వెళ్తే బాగుంటుంది " అనుకున్నారు. వాళ్ళు ఎంత సీరియస్‌గా చర్చించుకున్నారంటే, తరగతిలోకి శివ సార్ వచ్చిన విషయాన్నే వాళ్ళు గుర్తించలేదు.

అయితే సార్ చెప్పారు - "గోవా నుండి అరేబియా మహా సముద్రంలో ప్రయాణించి ,

కన్యాకుమారి దగ్గర బంగాళాఖాతంలోకి పోవాలి. చెన్నైలో షిప్ మారాలి . పోర్ట్ బ్లెయిర్‌కు ప్రయాణమే వారం -పది రోజులు పడుతుంది. వెనక్కి వచ్చేందుకు మరో పది రోజులు! అంటే ట్రిప్పుకు కనీసంగా ఇరవై - ఇరవై ఐదు రోజుల సమయం పడుతుందనమాట! అందుకని ఇది మన బడి విహారయాత్రకు సరిపోదు" అని.



పిల్లలంతా ప్రాధేయపడ్డ మీదట, శివసార్ అన్నారు- కావాలంటే మనం కొంతమందిమి ఎండాకాలం సెలవల్లో ఆవిధంగా ప్లాన్ చేయచ్చు. పడవ ప్రయాణపు ఖర్చే ఒక్కో పిల్లవాడికీ పది వేల రూపాయలవరకూ కావచ్చు. రిస్కు కూడా చాలా ఉంటుంది . మరి మీ పేరెంట్స్ ఏమంటారో , అడిగి చూడండి. ట్రిప్పుకు వచ్చేవాళ్లకు ఈత తప్పని సరిగా వచ్చిఉండాలి.." అని.

సెలవలు మొదలవ్వగానే అంతా అండమాన్-నికోబార్ దీవులకు షిప్‌లో బయలు దేరారు.

రెండు రోజులు ప్రయాణం చక్కగా సాగింది. మూడో రోజున అనుకోకుండా షిప్ సముద్ర మధ్యంలో నిలబడిపోయింది!

"షిప్ రిపేరుకు వచ్చింది. దీనిని బాగుచేసేవాళ్ళు ఇప్పుడు రష్యా నుండి రావాల్సి ఉంటుంది!" అన్నాడు షిప్ కెప్టెన్. అందరూ "ఓ..!" అని మూలిగారు- "అంటే మనం ఇక్కడే నాలుగైదు రోజులు ఇరుక్కు పోయాం అనమాట!" అంటూ.

అయితే మన శ్రీ వర్ధన్ మాత్రం నీళ్ళను చూసుకుంటూ కుర్చున్నాడు . అంతలోకే

అతని ముందు నీళ్ళలోంచి డాల్ఫిన్ ఒకటి తల బయటికి పెట్టి చూసి , మళ్ళీ బుడుంగున మునిగి, కొద్ది దూరంలో దూరంగా తేలింది.

దాన్ని చూడగానే శ్రీవర్ధన్ తన ప్రక్కనే దగ్గర ఉన్న బకెట్‌లోని చేపను ఒక దాన్ని తీసి సముద్రంలోకి విసిరేసాడు . ఆ చేప సముద్రంలో పడేలోగా డాల్ఫిన్ చటుక్కున పైకి ఎగిరి ఆ చేపను అందుకుంది!

అట్లా రోజూ ఈ డాల్ఫిన్ షిప్ దగ్గరికి రావటం, వీడు చేపలు విసిరితే అది పైకి ఎగిరి, పల్టీ కొట్టి అందుకోవటం , అటుపైన నీళ్ళమీద తేలుతూ సముద్రపు నీళ్లనే ఫౌంటెన్ లాగా విరజిమ్మటం , వీడు ఈల వేసినప్పుడు తనూ ఈల వేస్తున్నట్లు అరవటం, ఇట్లా జరుగుతూ పోయింది.

నాలుగో రోజుకి పడవ రిపేరయి, చెన్నై వైపు ప్రయాణం మొదలు పెట్టింది . అందరూ సంతోషపడ్డారు కానీ , శ్రీ వర్ధన్‌కి మాత్రం డాల్ఫిన్‌ని వదిలేసి వెళ్తున్నందుకు విచారమే వేసింది. కానీ ఆశ్చర్యం! డాల్ఫిన్ ఇప్పుడు షిప్ వెనకనే రావటం మొదలు పెట్టింది ! షిప్ ఎక్కడ ఆగినా అది పైకి వచ్చి , శ్రీ వర్ధన్‌ని పిలుస్తున్నట్లు ఈల వేస్తున్నది!

చెన్నై దాటి బంగాళాఖాతంలో ప్రయాణం మొదలయ్యాక, వాతావరణంలో స్పష్టమైన మార్పు తెలియ వచ్చింది . 'రెండు సముద్రాల నీళ్ళూ, వాటి తీరూ వేరు !'; 'రెండింటిలోనూ పెరిగే జీవజాలాలు వేరు !': "మరి ఈ నీళ్ళలో మన డాల్ఫిన్ బ్రతుకగ – ల్గుతుందా?" అని అడిగాడు శ్రీవర్ధన్ . శివసార్ చెప్పాడు:

డాల్ఫిన్‌లు గోవా ప్రాంతంలోనూ ఉన్నాయి , ఇటు అండమాన్ వైపు కూడా ఉన్నాయి . అందువల్ల అది 'ఇక్కడ బ్రతకలేకపోవటం' అంటూ లేదు . ఏమంటే డాల్ఫిన్‌లు సామాజిక జీవులు. గుంపులుగా ఉండేం – దుకు ఇష్టపడతాయి. దీని గుంపును వదిలి ఇది ఒక్కటీ మనతో బాటు వస్తోందంటే ,

మన బాధ్యత ఇంకా ఎక్కువ అయిందన–మాటే.. దాని భద్రత మనదే!"

ఆ రోజున, అటు తర్వాత కూడా రెండు రోజులు డాల్ఫిన్ కనబడలేదు . శ్రీవర్ధన్ విచారం ఎక్కువైంది . షిప్‌లో పరిచయం అయిన గజ యీతగాళ్ల దగ్గర ఆక్సిజన్ సిలిండర్, సముద్రంలోకి దిగేప్పుడు పనికి వచ్చే డ్రస్ ఒకటి ఇప్పించుకొని , రక్షణకోసం అన్నట్లు రెండు కత్తులు కూడా నడుముకు తగిలించుకొని, శివ సర్ చూస్తూండగానే సముద్రంలోకి దూకాడు . పైనుండి అతన్ని వారిస్తున్నాడు సర్.. కానీ అతను వినిపిం – చుకోలేదు..

సముద్రంలో కదలికలు ఎక్కువగా ఉన్నాయి. ఎరుపు రంగు కలిసిన నీళ్ళలో దూరంగా కనిపించింది డాల్ఫిన్- అయితే దానికి దగ్గ–ర్లోనే తిరుగుతున్నదొక సొరచేప!

ఆ సొరచేపను షిప్ వైపుకు రానివ్వకుండా దూరంగా ఉంచేందుకు డాల్ఫిన్ ప్రయత్ని–స్తున్నది. ఈదుకుంటూ అది ఉన్నవైపుకు పోయాడు వర్ధన్. సొర చేప ఇతని వైపుకు వేగంగా రాసాగింది. వర్ధన్ కత్తుల్ని రెండు చేతులతోటీ పట్టుకొని దాని వైపుకు పోయాడు గానీ, అది ఇతన్ని తప్పించుకొని వెనకగా వచ్చి, బలంగా నెట్టింది.




అదుపు తప్పిన వర్ధన్ మరో వైపుకు పోతూ, తనకు ఎదురుగా వచ్చిన చేపను ఒకదాన్ని కత్తులతో తెగ కోసాడు ! వాటి రక్తానికి ఆకర్షింపబడి సొరచేప అటువైపుకు దూసుకు వచ్చింది.

ఒక క్షణం ఆలస్యం అయినా అది వర్ధన్ మీదికి దూకేదే- అయితే అంతలోనే డాల్ఫిన్ వేగంగా వచ్చి దానిని గుద్దింది . తేరుకున్న సొరచేప ఇప్పుడు వర్ధన్‌ని, డాల్ఫిన్‌నీ ప్రధాన శత్రువులుగా గుర్తించి , వర్ధన్ వైపుకూ దూసుకు రాబోయింది!

అయితే మధ్యలోనే దాన్ని అడ్డుకున్న డాల్ఫిన్, చటుక్కున దాన్ని పైకి ఎత్తి విసి – రింది. వెంటనే శ్రీవర్ధన్ కూడా తన దగ్గరున్న విషపు కత్తులను దాని మీదికి విసిరాడు . రెండు కత్తులూ సొరచేప కడుపును చీల్చి వేసినై! సొరచేప గిలగిల కొట్టుకుంటూ చచ్చిపోయింది!

కానీ అంతలోపే శ్రీ వర్ధన్ ఆక్సిజన్ లెవెల్స్ పడిపోసాగాయి. ఆ సంగతి అర్థమైనట్లు , డాల్ఫిన్ చటుక్కున అతని క్రిందుగా వచ్చి , అతన్ని వేగంగా నీళ్ల పైకి చేర్చింది!

శివ సార్, ఇతర పిల్లలు అతనికి చేతులు అందించి షిప్ పైకి లాక్కొని , ప్రథమ చికిత్స చేసారు. తనకు ఇష్టమైన డాల్ఫిన్ కోసం సొరచేపతో యుద్ధం చేసిన వర్ధన్ సాహసాన్ని ఒకవైపున మెచ్చుకుంటూనే, అంత అతి చేసినందుకు వాడిని మందలించారు షిప్ – లోని వాళ్ళు అందరూ!

వాడిని కాపాడిన డాల్ఫిన్‌కు అందరూ కృతజ్ఞతలు చెప్పుకున్నారు . దానికి తమ దగ్గరున్న చేపలను ఆహారంగా వేసారు!

అటుపైన వాళ్ల అండమాన్ యాత్ర గొప్పగా సాగింది.

***

అండమాన్ నుండి వెనక్కి వచ్చేంతవరకూ కూడా డాల్ఫిన్ వీళ్ల షిప్‌ను అనుసరించి వస్తూనే ఉంది!

1. సత్యం,ప్రేమ ఎక్కడుంటాయో అక్కడ శాంతి తప్పక ఉంటుంది

2. గమ్యం లేని నావలాగా ఆదర్శం లేని శ్రమ నిరర్థకం.

-మహాత్మా గాంధీ

# ముగింపు లేని హాస్టల్ కథ!

హాస్యం

*దొంగకి ఏమైందో తెలీక మేం కూడా మూర్ఛపోయాం... చదివాక మీరు ఏమయ్యారో చెప్పండి.*

*రచన, బొమ్మ : తబస్సుమ్, సత్య , జీవిత; పదో తరగతి, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి,*

అనగనగా ఒక ఊరిలో ఒక హాస్టల్ ఉండేది. (అందులో జీవిత కూడా ఉండేది)

హాస్టల్లో 'ప్రకృతి' ఉండేది కాదు. అయినా అది ఎంతో ఆహ్లాదకరంగా ఉండేది.

అక్కడ ఉన్న పిల్లలందరూ ఎలా ఉండేవారో తెలుసా.....? పిల్లల్లానే ఉండేవారు!

ఆ పిల్లలు తమ దగ్గర ఉన్న డబ్బులు పోతా-యనే ఉద్దేశంతో ఆ డబ్బును వార్డెన్‌కి ఇచ్చేవారు. మీకు ఒక రహస్యం చెప్తా .. ఆ వార్డెన్ పిల్లలను అస్సలు పట్టించుకునేది కాదు. తన గదికే పరిమితమై ఉండేది. అమె ఒక పెద్ద తిండిపోతు కూడా ! ఏ ఆహార పదార్థం కనిపించినా మిగలకుండా తినేసేది !

కానీ పిల్లలు ఇచ్చిన డబ్బును మాత్రం సొంత పనులకు వాడుకునేది కాదు . ఆ డబ్బు-నంతా తన గదిలో భద్రంగా దాచేది.

ఒక రోజున తన కుమార్తెను ఆ హాస్టల్లో జాయిన్ చేయాలని ఒక దొంగ, అతని-మిత్రుడు, వచ్చారు. సరిగ్గా అదే సమయా-నికి వార్డెన్ డబ్బును దాస్తున్నది. అది వాళ్ళ కంట పడ్డది.

దొంగ తన కుమార్తెను అక్కడ జాయిన్ చేసేసి, తిరిగి వెళ్తూ మిత్రుడితో "ఒరేయ్ రాముా! ఆమె డబ్బులు ఎక్కడ పెట్టిందో చూసాం కదురా మనం? ఏదో ఒక రోజున దాన్ని దొంగిలించాలి.... ఏదైనా ఉపాయం చెప్పు!" అన్నాడు.

"ఏమోరా, నాకేమీ ఐడియాలు తట్టట్లేదు .

నువ్వే చెప్పు ఏమైనా !" అన్నాడు రాము (రాముకి అస్సలు తెలివి లేదు . అందుకనే ఒకరోజున వేరేచోట ఎక్కడో దొంగతనం చేసి, తనమీద తానే పోలీసులకు కంప్లెయింటు ఇచ్చుకున్నాడు!).

"సరేలే, త్వరలో వద్దాం, మళ్ళీ" అన్నాడు దొంగ. (ఇతనికి తెలివి ఉంది)

***



అదే హాస్టల్లో కళ్ళు లేని వంటామె ఒకామె ఉండేది. (గుడ్డామె వంట ఎలా చేస్తుందని ఆశ్చర్యపోతున్నారు కదూ , ఆమెకు సహాయం చేయడానికి ఇంకొకామె ఉండే – దిలే.. ఆమెది ప్రభుత్వం నియమించిన పని, అందుకని ఆమెను ఎవ్వరూ ఏమీ చేయలే – కపోయారు! ఇక ఆమె వంట ఎలా ఉంటుందో మీరే ఊహించుకోండి!)

ఆ రోజు వంట అయ్యింది : పిల్లలంతా అయిష్టంగానే తిన్నారు; కానీ వాళ్ళ ఆకలి మాత్రం తీరలేదు! దాంతో వాళ్ళంతా కలిసి 'బయట ఎక్కడైనా హోటల్లో కనీసం ఒక టిఫిన్ తిని రావాలి' అని మాట్లాడుకుంటు – న్నారు.

అట్లా వాళ్ళు గట్టిగా మాట్లాడుకుంటూం – డటం విని గుడ్డి వంటామె వచ్చింది అక్క – డికి. "ఏయ్..... మీరంతా ఇప్పుడు ఏం చేస్తున్నారు? వెళ్ళండి, వెళ్ళి చదువుకోండి!" అని గట్టిగా అరిచింది . ఆ అరుపు ఎలా ఉందో తెలుసా....?! అరుపులానే ఉంది!

ఇక ఆ అరుపు విని అందరూ చదువుకు – న్నారు. (లేదు లెండి. చదువుకుంటున్న–

ట్టుగా నటించారు !) కొద్దిసేపు అయ్యాక ఒక్కొక్కరూ ఎప్పటి మాదిరే సైలెంట్ గా బయటికి వెళ్ళిపోయారు!

(ఇంతకీ 'పిల్లలు అట్లా లేచి వెళ్ళిపోతుంటే వార్డెన్ ఏం చేస్తోంది ' అని డౌట్ వస్తోంది కదూ... దానికి సమాధానం చాలా పెద్దది - అయినా చెప్పక తప్పదు. అట్లా 'ఆ పిల్ల–లంతా చదువుకుంటున్నారు కదా' అని గుడ్డి వంటామె తన పనిలో తాను నిమగ్నమై పోయింది కదా; పొద్దున అంతా తినగా మిగిలిన చారును మొత్తాన్నీ ఒక గిన్నెలో పెట్టింది. కానీ ఆ పాత్రకి మూత పెట్టడం మర్చిపోయింది. దాంతో ఆ చారులో బల్లి పడింది! అయితే ఆమెకి ఏమీ కనిపించదు - కాబట్టి ఈ విషయం ఆమెకి తెలీలేదు.

ఇంతలో వార్డెన్ గారు వచ్చారు - "నాకు చాలా ఆకలిగా ఉంది , ఏమైనా ఉందా ? కొంచెం అన్నం , చారు ఉంటే పెట్టు !" అన్నారు. గుడ్డి వంటామె చక్కగా ప్లేట్ నిండా అన్నం పెట్టి , దానిపైన చారు వేసి వార్డెన్ కి వడ్డించింది. అంతే!

అన్నం మీద కళ్ళు తెరుచుకోని , నాలుక బయట పెట్టి కదలక మెదలక పడిఉన్న బల్లిని చూసే సరికి వార్డెన్ కాస్తా మూర్ఛపోయింది! అట్లా మూర్ఛపోయిన వార్డెన్ , పిల్లలు ఒక్కొక్కరే బయటికి వెళ్ళి తింటే ఇంక ఏమంటుంది?- ఏమీ అనలేదు! అర్థమైందా ఇప్పుడు?)

అట్లా పిల్లలంతా బయటికి వెళ్ళి సంతోషంగా టిఫిన్ చేసి వచ్చారు.

అట్లా కథ కొత్తపల్లికి, మనం సంతోషంగా హాస్టల్ బయటికి ! (అయ్యో, దొంగల గురించి చెప్పడమే మర్చిపోయామే .... చెప్తాం ఆగండి ... ఓహ్ సారీ.. ఓపిక లేదు–లేండి.. మళ్ళీ చెప్తాం.. లేకపోతే మీరే ఊహించుకోండి గదా ప్లీజ్?!)




# జింక-పులి

*ఆవు-పులి కథ తెలుసా, మీకు?! ఇది కూడా ఆ కథే, మరో రకంగా చెప్పింది ఈ పాప!*

*అనుసరణ: పి.మమత, పదవ తరగతి, కస్తూరిబాగాంధీ బాలికా విద్యాలయ, ఝరాసంగం, మెదక్ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.*

అడవిలో ఒంటరిగా వెళ్తున్న జింకను , అప్పుడే వేటకు వెళ్ళి వస్తున్న ఒక పులి చూసి , దాని వెంట పడింది.

గర్భిణి అయిన జింక వేగంగా పరుగెత్తలేక , దానికి దొరికి పోయింది : ఇంక తప్పించుకునే అవకాశం లేకుండా ఇరుక్కుపోయింది. పులి తన పంజా ఎత్తి దాన్ని ఒక్క దెబ్బ కొట్టబో – యేంతలో అది "దయచేసి నన్ను చంపొద్దు. నేను కడుపుతో ఉన్నాను. కడుపులో ఉన్న ఆ పిల్ల కూడా నాతోపాటు నిష్కారణంగా చచ్చిపోతుంది. ఇంకా కళ్ళు తెరవని కూనను చంపడం

పాపం: నీకు ఆ అవసరం లేదు. కాన్పు కాగానే, ఆ పిల్లను ఓసారి కళ్ళారా చూసుకుని, మళ్ళీ నీ దగ్గరికి తిరిగి వస్తాను- కాదనకు" అని దణ్ణంపెట్టింది.




"గర్భంలో ఉన్న పిల్ల లేతగా , మరింత రుచిగా ఉంటుంది. నేను మీ ఇద్దరినీ ఒకేసారి తినే – స్తాను" అన్నది పులి.

"దయచేసి నా మాట విను. నువ్వు ఎప్పుడైనా నీకు దొరికిన జంతువుల తల్లుల్ని, తండ్రుల్ని తినచ్చు; కానీ పిల్లలను మటుకు తినకు. పిల్లల వల్ల జంతువుల సంతతి నిలబడుతుంది " అన్నది జింక.

"నేను కాకపోతే మరే మృగమైనా నిన్ను తింటుంది. నీ మాటలు నమ్మేదెలా?" అన్నది పులి.

"నన్ను నమ్ము పులి రాజా ! నాకు బిడ్డ పుట్టగానే నీ దగ్గరకు వచ్చేస్తాను" అని ఏడ్చింది జింక.

"సరే వదిలేస్తున్నాను. వెళ్లు! నా గుహకు తలుపులు లేవు . పిల్ల పుట్టగానే నువ్వు నేరుగా నా గుహలోకే వచ్చేయాలి" అని దాన్ని వదిలేసింది పులి.

"మాట తప్పను పులిరాజా ! కృతజ్ఞతలు!" అంటూ తన మందను చేరుకున్న జింక , ఈ కథనంతా తోటి జింకలకు చెప్పుకొని ,"బిడ్డ పుట్టగానే దాన్ని వదిలేసి పోతాను నేను . పులికి ఆహారమైపోతాను. నా బిడ్డను ఇక మీరే సాకాలి " అని అభ్యర్థించింది. తోటి జింకలన్నీ కంట

తడి పెడుతూ సరేనన్నాయి.



కొద్ది రోజులకు దానికి ఒక బుజ్జి జింక పిల్ల పుట్టింది. ఆ పిల్లను దగ్గరకు తీసుకుని కన్నీరు కార్చిందది. కానీ ఇక ఆలసించకుండా ఆ బిడ్డను తోటి జింకలకు అప్పగించి , తాను నేరుగా పులి గుహలోకి పోయింది.

ఇచ్చిన మాట ప్రకారం తిరిగి వచ్చిన జింకను చూసి పులి చాలా ఆశ్చర్య పోయింది. "మాట కోసం తిరిగి వచ్చావు నువ్వు. చాలా గొప్పదానివి. నాకు ప్రస్తుతం ఆకలిగా కూడా లేదు . నిన్ను చంపను- పో" అని పులి దాన్ని చంపకుండా వదిలేసింది.

దానికి కృతజ్ఞతలు చెప్పుకొని, పిల్లను తిరిగి చూడాలన్న ఉత్సాహంతో గబగబా ఇంటికి పరుగు పెట్టింది జింక.

**పొడుపు కథలు:**

1. ఇక్కడ విసిరిన రాయి కాశీకి చేరు....బాట
2. ఇక్కడ అక్కడ వుంటుంది కబుర్లు అందిస్తుంది.....టెలిఫోన్
3. ఇంటిగోడమీద వెలుగుల బంతి, ఇల్లంతా వెన్నెల బంతి.....బల్బు
4. ఈ ఇంటికి ఆ ఇంటికి మధ్యన ఒకటే దూలం....ముక్కు
5. ఇంత పిల్ల ఇల్లెక్కి పిండి కొట్టింది.

జవాబులు: 1.బాట, 2.టెలిఫోన్, 3.బల్బు, 4.ముక్కు, 5.చెక్కపురుగు

*సౌజన్యం: డా. పత్తిపాక మోహన్, సిరిసిల్ల జిల్లా*




# కురు పాండవం

*రచన: నాగ సంధ్య, 8 వ తరగతి, అరవిందా స్కూల్, విజయవాడ.*

పాండవులు-కౌరవులు పిల్లలుగా ఉన్నప్పుడు అంతా కలిసే ఉండేవాళ్ళు. వాళ్ళు పెద్దయిన తర్వాత ఎట్లా కొట్టుకునేవాళ్ళో, చిన్నప్పుడూ అట్లానే గుంపులు కట్టి కొట్లాడుకునేవాళ్ళు - ఏమంటే పెద్దయ్యాక వాళ్ల దగ్గరికి కత్తులు , డాలులు వచ్చాయి ; మరి చిన్నప్పుడు కట్టెలు, తట్టలు ఉండేవి.

ఒకసారి వాళ్ళు ఇట్లా కట్టెలు , అన్నం తినే ప్లేట్లు పట్టుకొని పెద్ద కొట్లాట మొదలు పెట్టి–నప్పుడు, నారదుడు వచ్చాడు. నారదుడు త్రిలోక సంచారి. అన్ని లోకాల్లోను , అన్ని దేశాల్లోను ఎవరెవరు -ఎప్పుడెప్పుడు-ఏమేం ఆటలు ఆడతారో , ఎట్లా కొట్టుకుంటారో ఆయనకు తెలిసినట్లు ఇంకెవ్వరికీ తెలీదు.

ఆయన అన్నాడు- "ఆగండిరా పిల్లలూ ! కట్టెలు-తట్టలు పట్టుకొని కొట్టుకునే ఆటలు పాతబడిపోయినై. మీరు రాకుమారులు కదా, వేరే ఏమైనా కొత్త ఆటలు కనుక్కోండి" అని.

"పెద్దలు, మీకు తెలీని ఆట లేదు . మీరే ఏదైనా కొత్త ఆట నేర్పించాలి మాకు " అన్నాడు ధర్మరాజు.



"ఈ ధర్మరాజుకు సొంత ఐడియాలే ఉండవు. నా ఊహలనే, అన్నిటినీ తనవిగా చెప్పుకుంటాడు. కొత్త ఆట ఏదైనా చెప్పండి!" అన్నాడు సుయోధనుడు.

"ఆటలు అనేవి రక్తాన్ని చిందించేవిగా ఉండకూడదు నాయనలారా! జనాల మధ్య ఉన్న వైషమ్యాలవల్ల నిజ జీవితాల్లో మారణ–హోమాలు జరగకుండా, ఈ ఆటలు అడ్డు–కుంటాయి. వాళ్లమధ్య ఉత్తుత్తి వైరాలను కల్పించి, వారిలోని వైషమ్యం బలహీనమ –య్యేందుకు తోడ్పడతాయి.

రాబోయే కలియుగంలో పిల్లలు , పెద్దలు అంతా ఆడనున్న 'క్రికెట్ ' ఆట ఆకోవకు చెందిందే. మీకు నేను దివ్య చక్షువులు ఇస్తాను. వాటి సహాయంతో ఆ ఆట నియమాలు చూసుకొని, మీరంతా సంతో–షంగా, గొడవలు గొడవలుగా ఆ ఆట ఆడండి. మీకు మేలు జరుగుతుంది " అని చెప్పాడు నారదుడు.

ఆయన మహిమవల్ల పాండవులకు కౌరవు –లకు అందరికీ క్రికెట్ ఆట గురించి అర్థం అయిపోయింది.

కొన్ని కొన్ని సమస్యలు ఉండినై . కౌరవులలో ఉన్న వంద మందీ, "మేం ఆడతాం అంటే

మేం ఆడతాం" అని గొడవ పడ్డారు.

ఇటువైపున పాండవులను మరొక భయం పీడించింది: "క్రికెట్‌మ్యాచ్‌లో టీముకు 11 మందే ఉండాలి కదా . మరి మేం ఐదు మందిమే ఉన్నాము - మిగిలిన ఆరుగురినీ కౌరవులలోంచి తీసుకోవాల్సిందేనా , ఐపీయల్ లీగ్ మ్యాచుల్లో లాగా?" అని.

ఆ గొడవలు ఎంతకీ సద్దుమణగక పోయే సరికి మధ్యలో ఎంపైర్‌గా నిల్చున్న నారదుడు, సుయోధనుడితో మాట్లాడి , 'కౌరవులలో బాగా ఆడే వాళ్ళను గుర్తించి వాళ్ళను వరసలో పెట్టి , మిగతా వాళ్ళని అందరినీ ఎక్స్ట్రాలుగా పెట్టమని సలహా ఇచ్చాడు. "అందరం టీములో ఉన్నాం" అని కౌరవులంతా సంతోషపడ్డారు.

అలాగే పాండవులకు తరుగు పడిన ఆరుగురు ఆటగాళ్ళనూ ఒకరిద్దరిని ముంబాయినుండి, ఒకరిద్దరిని కలకత్తా , బెంగుళూరులనుండి తెచ్చి టీమును నింపుకోవచ్చు గదా " అని సలహా ఇచ్చాడు నారదుడు.

"అయ్యో! ఈ ఆలోచన మనకు రాలేదే , పెద్దలు అందుకనే ఉండి దారి చూపాలి " అనుకొని అట్లాగే చేసారు పాండవులు . ఆ విధంగా రెండు మెరికల్లాంటి టీములు తయారయ్యాయి.



"పాండవులకు, కౌరవులకు ఒకే గురువు ద్రోణుడు ఉంటే కుదరదు " అని గొడవ చేసాడు సుయోధనుడు. "సరే, మీరు ద్రో–ణుడిని తీసుకోండి, మేం కృష్ణుడిని తీసు – కుంటాం" అని పాండవులు అన్నారు. అట్లా మళ్ళీ ఇంకో సర్దుబాటు జరిగింది.

కృష్ణుడు, ద్రోణుడు తమ తమ బాధ్యతల్ని బాగా నిర్వర్తించారు. ఎవరి టీములకు వాళ్ళు చక్కని కోచింగు ఇచ్చుకున్నారు . మధ్య మధ్య తలెత్తిన లెక్క లేనన్ని సమస్యల్ని సర్దుబాటుచేసారు అంతా.

చివరికి మంచి ముహూర్తం చూసుకొని , ఒక రోజును ట్వెంటీ-ట్వెంటీ ఆటగా నిర్ణయిం–చుకున్నారు.

ఆ రోజు రానే వచ్చింది . ఇరవై ఓవర్లలో భీముడు-ఇంకో ముంబాయి ఆటగాడు కలిసి జంటగా 316 పరుగులు తీసారు . ఒక్క వికెట్టూ పడలేదు.

తర్వాత ఆడిన కౌరవుల టీములో సుయో–ధనుడు, దుశ్శాసనుడు కలిసి పంతొమ్మిది ఓవర్లకు గాను 302 పరుగులు తీసారు . అంతలో వాన మొదలై , ఆటని ఆపాల్సి వచ్చింది.

"మేమే గెలిచాం , మావి 316" అన్నాడు భీముడు. "గెలుపు మాది . ఇంకో ఓవర్లో పద్నాలుగు పరుగులు మాకొక లెక్క కాదు " అన్నాడు సుయోధనుడు.

"ఇప్పుడు ఎవరు గెల్చారన్నా , అన్నవారిని ఓడినవారు బ్రతుకనివ్వరు" అని ముసిము–సిగా నవ్వాడు కృష్ణుడు.

అప్పటికప్పుడు భవిష్యత్తుని చూసిన నారదుడు "ఆట 'డ్రా'- ఎవ్వరూ గెలవలేదు. మళ్ళీ ఆడాల్సిందే ఇంకోసారి ఎప్పుడైనా " అన్నాడు తెలివిగా.

"అవునవును" అని కృష్ణుడూ , ద్రోణుడూ తదుపరి మ్యాచ్ కోసం ఆలోచనలు మొదలుపెట్టారు.

అటు తర్వాత ఇంకెప్పుడూ వాళ్ల మధ్య నిజమైన యుద్ధం జరగనే లేదు ! అట్లా ప్రపంచంలో అంతా శాంతిని తెచ్చినందుకు–గాను దేవతలంతా నారదుడికి 'లోక శాంతి పురస్కారం' ఇచ్చి గౌరవించారు! 

పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడె పుట్టదు; జనులా పుత్రుని కనుగొని పొగడగ, పుత్రోత్సాహంబు నాడు పొందు!



# మాయలోకం

*రచన: ఎ.లోకేష్ , క్రాస్ వర్డ్ స్కూల్, గుంటూరు.* *ముగింపు: కొత్తపల్లి.*

అనగనగా ఒక దేశం. ఆ దేశంలో కారులు, బైకులు ఉండవు. ఆ దేశంలో నాకు ఒక స్నేహితుడు ఉన్నాడు. వాడి పేరు జేమ్స్.

జేమ్స్ నాకు ఒక లేఖ రాశాడు. దానిలో ఏమి ఉంది అంటే, 'అక్కడ వాళ్ల లోకంలో ఎగిరే తివాచీ, ఎగిరే బూజు కర్ర దొరుకు–తాయట! దానిని తను కొనుక్కున్నాడట!

ఇప్పుడు వాళ్ల దేశంలో కారులు, బైకులు కన్నా అవే ఎక్కువగా ఉన్నాయట! వాటి మీదే తను రోజు బడికి వెళుతున్నాడు. అవి కూడా బాగా చవక ధరలోనే అమ్ముతు–న్నారు.

ఒకసారి వాటి మీద ఎగురుతూ జేమ్స్, వాళ్ళ స్నేహితులు అడవికి వెళ్ళారట. అక్కడ

ఎన్నో విచిత్రమైన జంతువులను చూసారు . అయితే, వీళ్ళు చూస్తుండగా ఆ జంతువుల మధ్యన ఏదో కలకలం రేగింది. ఆ గందర-గోళంలో వాళ్ల బూజుకర్ర ఎక్కడ పడిపో - యిందో, పడిపోయింది!

దాని మీద ఆశ పెట్టుకొని వీళ్లెవ్వరూ తాము వెళ్ళిన చోటుకు దారి కూడా చూసుకోలేదు. ఇప్పుడు ఇంటికి వెనక్కి వెళ్ళేదెలాగ?!

వాళ్ళంతా చాలా భయపడ్డారు . అయితే సరిగ్గా ఆ సమయానికి అటుగా వెళ్తున్న ఒకాయన వాళ్ళని చూసి ఆగాడు : "ఏమైంది? ఏమైనా సమస్య ?" అని అడిగాడు. వాళ్ళు తమ బూజుకర్ర పడిపో-యిన సంగతి చెప్పారు.

"దానిదేమున్నది, దాని పేరు పెట్టి పిలవండి , వస్తుంది!" అన్నాడాయన.

జేమ్స్ బిక్క మొఖం వేసాడు . "మా బూజుకర్రకు ఇంకా పేరు పెట్టలేదు !" అన్నాడు.

అయ్యో, అందుకనే నేను ఎప్పుడూ చెబు-తుంటాను, "బూజుకర్రలు కొనగానే వాటిని రిజిస్టర్ చేయాలి " అని అన్నాడాయన జాలిగా. "అయినా పర్లేదు, ఈమధ్య వాళ్ళు వాటికి గొంతును గుర్తుపట్టే విద్య కూడా నేర్పుతున్నారు. మీ బూజుకర్ర మీ గొంతును గుర్తుపట్టచ్చు. ఏదైనా ఒక పాట- 'రా రా రా, బూజుకర్రా, రా' లాంటిది పాడండి " అని చెప్పాడు ఆయన. వీళ్ళు ఆ పాట పాడేట-ప్పటికి ఎక్కడున్నదో గాని, బూజుకర్ర వాళ్ళ దగ్గరికి ఎగిరి వచ్చేసింది!

మిత్రులు ఇద్దరూ ఆయనకు థాంక్స్ చెప్పి , దానిని ఎక్కబోయారు.

ఆయన తన తివాచీ మీదనే వాళ్లకు దగ్గరగా వచ్చి, "మీరు ఇంకా రిజిస్టర్ చేయలేదు గనక ఈ బూజుకర్రని వాడేందుకు లేదు . ఒక పని చేయండి - మీరు దాన్ని ప్రక్కన పెట్టుకొని, నా తివాచీ మీదికే వచ్చేయండి . నేను కూడా అటే , వెళ్ళేది. మిమ్మల్ని మీ ఇంటి దగ్గర దింపేసి పోతాను" అన్నాడు.

"సరే" అని వాళ్లంతా తివాచీ ఎక్కారు.

అయితే వాళ్లంతా అట్లా పోతుంటే ఒక పెద్ద పక్షి ఒకటి వాళ్ల మీద దాడి చేసింది . పెద్దాయన ఏదో మంత్రం చదివేసరికి అది కాస్తా మాయమైపోయింది . అందరూ ఆశ్చర్యపోయారు.




అయితే ఎంత సేపటికీ వాళ్ల ఇల్లు రాలేదు! కొద్ది సేపటికి తేరుకున్న జేమ్స్ క్రిందికి చూస్తే ఏముంది? వాళ్ళు వాళ్ళ దేశం కూడా దాటి వెళ్ళిపోతున్నారు!

"ఏంటి ఇది , మనం ఎటు పోతున్నాం ?" అన్నాడట జేమ్స్ అతనితో , ఆదుర్దాగా. అతను గట్టిగా నవ్వాడు - "అహ్హాహ్హాహ్హా" అని. "'మీరు వట్టి తిక్క పిల్లవాళ్ళు ; మీకు మంత్రాలు రావు' అని మిమ్మల్ని చూడగానే గుర్తుపట్టేశాను. మీలాంటి వాళ్ళు మన మంత్రాల లోకంలో ఉండనక్కర్లేదు. మీలాంటి మొద్దుల వల్ల మన లోకానికే చెడ్డపేరు వస్తుంది . అందుకనే ఇప్పుడు మిమ్మల్ని ఆఫ్రికా తీసుకెళ్ళిపోతున్నాను . అక్కడ మిమ్మల్ని క్రింద పడేసి నేను వెనక్కి – పోతాను! మిమ్మల్ని వదిలించినందుకుగాను మన ప్రభుత్వం ఇచ్చే బహుమతులను అందుకుంటాను!" అన్నాడు కోపంగా.

"మాకైతే మంత్రాలు రావు నిజమే, కానీ నీకు మటుకు తెలివి లేదు !" అని జేమ్స్, వాళ్ళ మిత్రుడు ఇద్దరూ ఒక్కసారిగా ముందుకు దూకి, ఆ మాంత్రికుడినే తివాచీ మీదినుండి క్రిందికి నెట్టేసారు ! అతను హాహాకారాలు చేస్తూ అంత ఎత్తునుండి క్రింద పడిపో – యాడు.

అటుపైన వీళ్ళు తివాచీని వెనక్కి తిరగమంటే అది తిరగలేదు: వీళ్ళు దాని యజమానులు కారు కదా?! వీళ్ల గొంతులు వేరాయె!

అప్పుడు జేమ్స్ కొంచెం ఆలోచించి, మిత్రు-డిని కూడా తన బూజుకర్ర మీద కూర్చో - మని, దానికి తమ ఇంటి అడ్రసు చెప్పాడు ! మరుక్షణం ఆ బూజుకర్ర గాలిలోకి లేచి, వీళ్ల లోకం వైపుగా వెనక్కి తిరిగింది.

తివాచీ మటుకు దాని దారిన అది ఆఫ్రికా వైపుకు ఎగిరి వెళ్ళిపోయింది!

అట్లా క్షేమంగా ఇల్లు చేరుకున్నాక ఊపిరి పీల్చుకున్న మిత్రులిద్దరూ "ఈ మాయ మంత్రాల లోకం కంటే అవి లేని మీ లోకమే చాలా మంచిది ! అక్కడ అందరినీ కనీసం బ్రతకనిస్తున్నారు!" అనుకున్నారట!

ఆ సంగతి చెప్పేందుకే, జేమ్సు నాకు ఉత్తరం వ్రాసాడు!

పొడుపు కథలు- సౌజన్యం: డా. పత్తిపాక మోహన్, రాజన్న సిరిసిల్ల జిల్లా, తెలంగాణ రాష్ట్రం.

1. ఎండిన మాను గలగల
2. ఎనిమిది ఎముకలు - గంపెడు పేగులు
3. ఎన్ని కన్నులున్నా రెండు కళ్ళతోనే చూచేది
4. ఎముక లేని పులి ఏటుకు ఎదురు పోయె
5. ఎర్రటి కాయలో నల్లటి విత్తులు
6. ఎక్కి ఊగేది పట్టి లాగేది ఏది?
7. ఎటు చదివినా ఒకే కవి
8. ఎంతకోసినా తరగని చెట్టు! నువ్వెట్లా ఉంటావు
9. ఎండిన బావిలో పిల్లలు గంతులేస్తారు



జవాబులు: 1.తప్పెట, 2.మంచం, 3.నెమలి, 4.జలగ, 5.ఎర్రపుంటి కాయ,6.ఊయల,7.వికటకవి, 8.పొగ9.పేలాలు,




# ముగ్గురు పరిగెత్తేవాళ్ళు

అనువాద కథ

రచన: ఆకర్ష్ , 6 వ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, విజయవాడ.

ఆఫ్రికాను తెల్ల దొరలు పరిపాలిస్తున్న రోజు -లవి. తెల్లవారికి మాత్రమే కేటాయించిన జోహన్నెస్‌బర్గ్‌లోని ఒకానొక ప్రాంతంలో యిద్దరు నల్ల వాళ్ళు కలుసుకున్నారు.

వాళ్ళలో ఒకతనికి ఆ ప్రాంతంలో పని చేయటానికి పర్మిట్ వుంది . మరొకతనికి లేదు: అంటే హద్దుమీరి ఆ ప్రాంతానికి వచ్చినందుకుగాను అతడిని పోలీసులు కటకటాలలో పెట్టొచ్చన్నమాట.

అంతలో అకస్మాత్తుగా ఒక పోలీసు అటువైపు వస్తూ కనిపించాడు. "ఏయ్! ఇక్కడ ఏం చేస్తున్నారు? ఏవీ, మీ పర్మిట్లు చూపిం - చండి!" అని చెయ్యి చాచాడు పోలీసు , దూరం నుండే.

"త్వరగా! నువ్వు ముందు పరిగెత్తు ! నీ వెనకాలనే నేనూ వస్తా !" అని చెప్పాడు పర్మిట్ వున్న మిత్రుడు . వెంటనే మిత్రులు యిద్దరూ కాలికి బుద్ధి చెప్పారు : అంటే పరిగెత్తిపోయారు అనమాట!




వీళ్లు పారిపోవడం చూసిన పోలీసు "ఆగండి...ఆగండి" అని అరుస్తూ వెంట పడ్డాడు. అట్లా చాలాదూరం పరుగు పెట్టాక గానీ, పర్మిట్ ఉన్న వ్యక్తి పోలీసు చేతికి చిక్కలేదు.

"ఇప్పుడు చిక్కావు ! ఇక నీతో ఆటాడు–కుంటాను!" అనుకున్న పోలీసు, ఆయాస–పడుతూనే అతడిని అడిగాడు - "ఏదీ, నీ పర్మిట్ చూపించు!" అని.

తత్తర పడుతున్నట్లుగా నటిస్తూ అతను కొంత సేపు ఆ జేబు యీ జేబు వెతికి , చివరికి తన పర్మిట్ తీసి చూపించాడు!

పోలీసు కంగు తిన్నాడు: "పర్మిట్ ఉంచుకొని కూడా ఎందుకు పరిగెత్తావు ?!" అని అరిచాడు అసహనంగా.

"డాక్టర్ సలహా ప్రకారం పరిగెత్తాను సార్ ! డాక్టరుగారు నన్ను రోజూ ఒక మైలు దూరం పరిగెత్తమన్నారు!" అన్నాడు అతను.

"అలాగయితే మరి నీ స్నేహితుడెందుకు పరిగెత్తాడు?" అని పోలీసు అడిగాడు.

"ఎవరు?" అంటూ అటూ ఇటూ చూసాడు నల్ల అతను. పర్మిట్ లేని వ్యక్తి ఆ సరికి కంటికి కనబడనంత దూరం పారిపోయి ఉన్నాడు.

"నీకంటే ముందు పరుగు పెట్టిన వాడు !" అన్నాడు పోలీసు చికాకుగా.



"ఓహ్ అతనా! అతన్ని కూడా డాక్టరు పరిగె–త్తమన్నాడు సార్!" అన్నాడు నల్లవాడు.

"ఆగండి! ఆగండి!" అని నేను మీ వెంట పడుతుంటే కనీసం ఆగలేదు మీరు - ఎందుకు? పోలీసు ఆగమన్నప్పుడు ఆగాలని తెలీదా?!" అని అడిగాడు పోలీసు, మరింత పట్టుదలగా.

"'మీకు కూడా పొట్ట బాగా వచ్చింది కదా , డాక్టరుగారు మిమ్మల్ని కూడా పరుగెత్తమ–న్నాడేమో!' అనుకున్నాను సర్. మీరు ఊరికే తోడు కోసం మమ్మల్ని ఆగమంటున్నారేమో అనుకున్నాను!" అన్నాడతను నింపాదిగా.

ఇంక ఏమీ అనలేని పోలీసు పళ్ళు నూరు–కుంటూ వెనుతిరిగాడు.

**మర్యాదాపురుషుడు!**

టీచర్: చింటూ! మీ నాన్న ఏం చేస్తారు?

చింటూ: రోజంతా మర్యాదగా అబద్ధాలు చెబుతుంటారు టీచర్.

టీచర్: అదేం మాట?! మీ నాన్నది ఏం ఉద్యోగం?

చింటూ: మా నాన్న కస్టమర్ కేర్ రిప్రజెంటేటివ్ టీచర్!

నవ్వు!

**హచ్-పిచ్చి!**

డాక్టర్: కుక్క దగ్గరికి పోయి ఏం చేశావ్, ఊరికే, పనిలేక?!

రాము: హచ్ కుక్కేమో అనుకుని దగ్గరికెళ్ళాను సర్, కరిచాక తెలిసింది- పిచ్చి కుక్క అని...!




# పరివర్తన

మూడు పేజీల కథ

*రచన: అశ్వని , 7 వ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాలపల్లి, ప్రకాశం జిల్లా.*




కంకణాలపల్లిలో నివసించే రాణికి పూలన్నా, పూలమొక్కలన్నా చాలా ఇష్టం.

ఇంటి ముందున్న ఖాళీ స్థలంలో తను ఒక పూల తోటను పెంచేది.

రోజూ నిద్రలేవగానే ఆ మొక్కల దగ్గరికి పోయి, వాటితో మాట్లాడేది; ఎండిపోయిన ఆకులు అవీ ఏరేసేది ; మొక్కలకు నీళ్లు పోసేది; పూల తోటలో ఎగిరే సీతాకోకచిలు–కలతో పాటు తనూ ఎగిరేందుకు ప్రయ –త్నించేది. సాయంత్రం బడినుండి రాగానే

కొత్త కొత్త మొక్కలు నాటి , మళ్ళీ నీళ్ళు పోసేది!

అదే ఊళ్లో ఉంటాడు రాము. వాడిది చాలా నష్టబుద్ధి. సాయంత్రం రాణి అటు ఇంట్లోకి వెళ్ళగానే ఇటు వచ్చి , కావాలని ఏదో ఒక నష్టం కలిగించి పోయేవాడు వాడు. ఎవ్వరూ చూడట్లేదంటే ఏదో ఒక పూల మొక్కని పీకి పడేసి పోయేవాడు.



ఈ పని రోజూ జరగటంతో రాణికి కోపం వచ్చింది. "ఎవరో నా మొక్కలను రోజూ పాడు చేస్తున్నారు. వాళ్ళని పట్టుకోవాలి!" అని ఒకరోజు సాయంత్రం ఒక ప్రక్కగా దాక్కొని చూసింది.

'తన తోటని పాడు చేస్తున్నది రామూనే' అని రూఢిగా తెలిసాక , వాడిని నిలేసింది : "రామూ! నువ్వు చేసేది తప్పు ! ఇట్లా కుదరదు! నువ్వు ఎన్ని మొక్కలు పీకేసావో, అన్ని మొక్కలు నువ్వే తిరిగి తెచ్చి నాటాలి!" అని.

కానీ వాడు వెటకారంగా నవ్వి , "నేను నాటను! నువ్వు ఏం చేసుకుంటావో చేసుకో" అని ఊరికే నిలబడ్డాడు.

"వీడు ఇట్లా చెబితే వినడు " అని రాణి పోయి రామూ వాళ్ళ అమ్మతో ఫిర్యాదు చేసింది. "అక్కా, చూడు! రాము నా తోటలోని మొక్కలను పీకి పడేస్తున్నాడు . నేను వద్దంటే వెటకారంగా నవ్వుతున్నాడు . మీరే ఏదో ఒకటి చెయ్యాలి" అని.

సరిగ్గా ఆ సమయానికే అటుగా వచ్చాడు రాము. వాళ్ల అమ్మ వాడిని పిలిచి "ఏరా, నిజమేనా? ఆ పాప ఇష్టంగా పెంచుకునే మొక్కలు పీకేశావా ? తప్పుకాదా? నువ్వు

పెంచుకొనే మొక్కని ఆ పాప పీకేస్తే ఎలా ఉంటుంది నీకు?" అన్నది.

వాడు చటుక్కున ఏడుపు లంకించుకుంటూ, "పీకెయ్యమను! నా మొక్కని పీకెయ్యమను ఆ పాపని!" అంటూ లోపలికి పరుగు తీసాడు.

"చూడమ్మా, రాణీ! రాము ఒకే ఒక మొక్కను కుండీలో పెంచుకుంటున్నాడు. అదంటే వాడికి చాలా ఇష్టం . కానీ దాన్ని కూడా రోజూ నీళ్ళు పోయకుండా చంపుతున్నాడు. నువ్వు కావాలంటే ఆ మొక్కను తీసుకెళ్ళిపో! దాన్ని ఏం చేసుకుంటావో నీ ఇష్టం" అన్నది, ఆ కుండీని చూపిస్తూ.

రాణి దాని దగ్గరికి వెళ్ళి, ఆ మొక్కని ప్రేమగా తడిమి, కాసిని నీళ్ళు తెచ్చి పోసింది . "వద్దులెండి అక్కా! వాడికి అంత ఇష్టమైన మొక్కని నేను తీసుకెళ్ళిపోతే వాడికి ఏం బాగుంటుంది? దాన్ని ఇక్కడే ఉండనివ్వండి. నేను రోజూ వచ్చి దానికి కూడా ఒక చెంబెడు నీళ్ళు పోసి పోతాను" అంది.

కిటికీలోంచి ఇదంతా వింటున్న రాముకు మనసులో ఏదో కదిలినట్లు అయింది.




ఆ తర్వాత వాడు ఆ మొక్కకి రోజూ నీళ్ళు అందించటమే కాక, మరిన్ని పూల మొక్కలు తెచ్చి నాటాడు. తమ ఇంట్లో నాటటమే కాదు; రాణికి కూడా తెచ్చి ఇచ్చాడు ! మొక్కల సంరక్షణలో రాణితో సమంగా పాలు పంచుకున్నాడు. తనకు మంచి స్నేహితుడయ్యాడు.

వాడిలో వచ్చిన మార్పును చూసి వాళ్ల అమ్మ కూడా చాలా సంతోషపడ్డది.



# సంతృప్తి

మూడు పేజీల కథ

*రచన: నాగేశ్వరి, పదవ తరగతి, కస్తూర్బా గాంధీ బాలికల విద్యాలయం, ఝురాసంగం, మెదక్ జిల్లా.*



సత్యశీలుడు - సుగుణావతి ఇద్దరూ అన్యో–న్యంగా ఉండేవాళ్ళు . వాళ్ళు ఆస్తిపరులు , పిల్లలు బుద్ధిమంతులు, డబ్బుకు ఏ లోటూ ఉండేది కాదు . ఆరోగ్యం మహత్తరంగా ఉండేది; అన్నీ బాగానే ఉండేవి - కానీ ఏదో తెలీని అసంతృప్తి వాళ్లని పీడించేది.

'భగవంతుడిని సేవిస్తే సంతోషం వస్తుంది ' అని భార్యభర్తలిద్దరూ పూజలు చేసేవాళ్ళు ; తీర్థయాత్రలు చేసేవాళ్ళు ; పుణ్యక్షేత్రాలు దర్శించేవాళ్ళు; ఉత్సవాల్లో పాల్గొంటుండే – వాళ్ళు.

అయితే కేవలం ఆ సందర్భాల్లో మాత్రమే వాళ్ళ మనసుకు ఉల్లాసంగా , తన్మయంగా అనిపించేది. ఆ తరువాత మళ్ళీ వాళ్ళు యధా ప్రకారం అసంతృప్తికి గురయ్యేవాళ్ళు.

అట్లానే 'గ్రంథ పఠనం' వల్ల సంతృప్తి వస్తుంది అని ఎవరో చెబితే కొన్నాళ్లపాటు వరస పెట్టి ధార్మిక గ్రంధాలు చదివించుకున్నారు ; పురాణ కాలక్షేపాలు అవీ చేయించారు కానీ మళ్ళీ యధాప్రకారం అసంతృప్తే.

ఆ సమయంలో వాళ్ళకు చిన్నప్పుడు పాఠాలు చెప్పిన గురువుగారు వాళ్ల ఊరికి వచ్చారు. సత్యశీలుడు-సుగుణవతి ఆయన్ని దర్శించుకొని తమ సమస్య చెప్పుకున్నారు . ఆయన అన్నారు- "చూడు నాయనా ! మనిషి సంఘజీవి.

'తనతోబాటు, తన చుట్టూ ఉన్నవాళ్ళు కూడా సంతోషంగా ఉండాలి ' అని కోరు – కుంటాడు ఎప్పుడూ . అందువల్లనే, తను ఒక్కడూ సుఖంగా ఉన్నంతమాత్రాన మనిషికి సంతృప్తి రాదు.




ఈ సమాజంలో ఎంతోమంది రకరకాల కష్టాలకు లోనవుతున్నారు; వైద్యం చేయిం – చుకునే శక్తి లేక ప్రాణాలు కోల్పోతున్నారు ; జ్ఞానపిపాస ఉన్నా యువకులు చాలామంది చదువులు కొనసాగించలేకపోతున్నారు .

పలువురు బ్రతుకు తెరువు లేక కష్టపడుతు‌న్నారు. వాళ్లకు మీ చేతనైనంత సాయం, మీ చేతనైన రీతుల్లో చేయండి. అప్పుడు చూడండి ఎంత తృప్తి కలుగుతుందో" అని.

గురువుగారి మాటల్లోని సత్యాన్ని అర్థం చేసుకున్న సత్యశీలుడు-సుగుణవతి ఇక ఏ మాత్రం ఆలస్యం చేయకుండా తమ గ్రామంలో రోగుల కోసం ఒక వైద్యశాల, యువతరం విద్యను కొనసాగించేందుకుగాను పాఠశాల, కళాశాల నిర్మించారు.

ఊళ్ళో అందరికీ బ్రతుకు తెరువులు చూపే వ్యవస్థలు ఏర్పరచారు. ఆర్థిక ఇబ్బందులతో సతమతమయ్యే కుటుంబాలకు సాయం చేసి, నిలద్రొక్కుకునేట్లు చూసారు.

వృద్ధులకు గౌరవాన్నీ, ప్రేమను పంచే కేంద్రాలను ఏర్పాటు చేసారు. ఇక అటుపైన వాళ్ళకు అసంతృప్తి అన్నమాటే గుర్తు రాలేదు!

నవ్వు!

**మా నాయనే!**

సంతా సింగ్ విచారంగా కూర్చొని ఉండగా బంతా సింగ్ వచ్చాడు.

బంతా: ఏంరా, ఇవాళ్ల మీ పెళ్ళి రోజు కదా, ఇట్లా విచారంగా కూర్చొని ఉన్నావేం?

సంతా: ఏం చెప్పను, పెళ్ళి రోజు సందర్భంగా మా ఆవిడకి నేను ఒక చైన్ తెచ్చి ఇచ్చాను. బదులుగా ఆమె నన్ను ఇంట్లోంచి వెళ్ళగొట్టింది!

బంతా: అసలామె మనిషేనా?! బంగారు చైన్ కొనిపెట్టిన వాడిని ఇంట్లోంచి వెళ్ళగొట్టింది?!

సంతా: నేను ఇచ్చింది బంగారు చైన్ కాదు. సైకిల్ చైన్!

**నేను విసరలేదు పులీ!**

సంతాసింగ్, బంతా సింగ్ ఒకసారి అడవిలో పోతుంటే పులి ఒకటి గర్జిస్తూ ఎదురు పడింది వాళ్లకి!

సంతాసింగ్ గబుక్కున తన చేతిలో ఉన్న కారం మిక్చర్ ని దాని కళ్ళలో పడేట్లు విసిరి కొట్టి, అరిచాడు- "బంతా! పారిపో!" అని.

బంతా అక్కడే నిలబడి అన్నాడు మొండిగా: "నేనెందుకు పారిపోవాలి, మిక్చర్ విసిరింది నువ్వేతే?!" అని!




# వ్యవసాయపు కథ

*వ్యవసాయం ఒక్కరి వల్ల అయ్యే పని కాదు . రైతు వ్యవసాయం చేస్తుంటే, అతనికి చేదోడువాదోడుగా అనేక వృత్తులు నిలిచి , రైతుతో పాటు వృద్ధి చెందినై . ఆధునికీకరణ వల్ల యంత్రాలు తయారవుతున్నాయి; క్రొత్త పనులు వస్తున్నాయి; రైతు పనిని సరళం చేస్తున్నాయి , కానీ మరొకవైపున అవి పల్లెల్లో చాలా మందిని నిరుద్యోగులుగా కూడా చేస్తున్నాయి.. ఆలోచింపజేసే ఈ కథ చదవండి.*

*రచన: సాత్విక చౌదరి, 7 వ తరగతి, అరవిందా స్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*

రామాపురంలో ఉండే విజయమ్మకు విత్తనాల గురించి బాగా తెలుసు. చిన్న చిన్న కమతాల్లో రకరకాల పంటల్ని వేసి, వాటినుండి మంచి విత్తనాలు తయారు చేసి, అమ్మేది ఆమె.

అంతేకాక రకరకాల విత్తనాలను ఆమె సేకరించి పెట్టుకొనేది కూడా . విత్తనాలను ఎంపిక చేసుకోవటంలో ఆమెకు చాలా నేర్పు ఉండేది.

అందరూ ఆమెని విత్తనాల విజయమ్మ అని పిలిచేవాళ్ళు.

అదే ఊళ్ళో నాగమ్మ అనే 'లీడర్' ఒకామె ఉండేది. ఆమె, ఆమెకు తోడుగా మరో ఇరమంది స్త్రీలు ఉండేవాళ్ళు - వీళ్లంతా కలిసి వరి మడులు గుత్తకు తీసుకొని నాట్లు వేసే –వాళ్ళు. అట్లా చేసి చేసి వాళ్ళు అంతా ఎంత మంచి పేరు తెచ్చుకున్నారంటే , అందరూ నాగమ్మను 'నాట్ల నాగమ్మ' అని పిలువసా–గారు.



ఆ ఊళ్ళోనే ఉన్న చింపిరయ్య క్రిమినాశక మందులు తయారు చేసేవాడు . రకరకాల ఆకులను, మూలికలను సేకరించి, వాటితో నాటు మందులు తయారు చేసేవాడు . వాటిని చల్లితే పంటలను ఆశించే పలురకాల పురుగులు నశించేవి . అందరూ అతన్ని 'చీడపీడల చింపిరయ్య' అనేవాళ్ళు.

ఆ చుట్టు ప్రక్కల పల్లెల్లో అంతటా 'సత్తువ సత్తయ్య' అందరికీ పలు రకాలుగా సాయం చేస్తుండేవాడు. ఏ కాలానికి తగినట్లు ఆ కాలంలో, ఉన్న వ్యర్థ పదార్థాలను అన్నింటినీ ఉపయోగించి, చెట్ల ఆకులు కొట్టి మడుల్లో వేయించి- అలా పొలాలకు కావలసిన 'సత్తువ' అందించేవాడు అతను. ఎవరైనా వరిపొలం పెట్టుకోవాలంటే ముందుగా 'సత్తువ సత్తయ్య'ను తప్పక సంప్రదించేవా–ళ్ళు.

ఇక పంటలు కోతలకు వచ్చాయంటే, ఊళ్ళో అందరిలోకీ బిజీగా ఉండేది 'కోతల సుబ్బా–రాయుడు', అతని బృందం . వాళ్ళు కోతలకు వస్తే ఒక్క గింజ కూడా వృధాపో –

దని, నీతిగా పంట మొత్తాన్నీ రైతుల ఇళ్ళకు చేర్చేవరకూ బాధ్యత తో వ్యవహరిస్తారని చెప్పుకునేవాళ్ళు.

అయితే వ్యవసాయ పద్ధతులు మారిన కొద్దీ వీళ్ళందరికీ బ్రతుకు తెరువు లేకుండా అయ్యింది. రైతులు హైబ్రిడ్ విత్తనాలు కొనుక్కొచ్చుకుంటున్నారు, ప్రభుత్వాలు కూడా విత్తనాలు సరఫరా చేస్తున్నాయి ; నాట్లు వేసేందుకు , కోతలకు యంత్రాలు వచ్చాయి, అట్లా కూలి పని తగ్గిపోయింది ; రసాయనిక ఎరువులు-పురుగుమందులు వచ్చి, కంపెనీల వాళ్ళ ప్రచారంలో కొట్టుకు పోతున్న రైతులు సత్తయ్యల్ని, చింపిరయ్యల్ని పట్టించుకోలేదు.

రామాపురం పెదరైతు రాఘవేంద్రరావు దీన్నంతా గమనించాడు: అతని పిల్లలు పెద్ద–వాళ్లయ్యారు, మంచి ఉద్యోగాలలో ఉన్నారు; 'తాము పర్యావరణానికి చాలానే చెడు చేస్తున్నాం' అని ఆయనకు బాగా అర్థమైంది.

'ఏం చేయాలి' అని ఆలోచించి ఆయన, ఆ సంవత్సరం విత్తనాల విజయమ్మ దగ్గర విత్త–నాలు తీసుకున్నాడు ; నాట్ల నాగమ్మ తో నాట్లు వేయించి నీరు పెట్టాడు; మరో రెండు వారాల వ్యవధిలో చీడపీడల చింపిరయ్యతో పురుగు మందులు పెట్టించాడు ; అందువల్ల ఆ పంటను ఇక పురుగులు ఆశించ లేదు.



అట్లా ఇరవై రోజుల తర్వాత సత్తవ సత్తయ్యని పిలిచి, అతనితో పొలానికి గండి కొట్టించి , పొలానికి కావలసిన ఎరువులను - సేంద్రియ పద్ధతిలో తయారైనవి, ఎక్కువ మొత్తాలలో వేయించాడు. చక్కగా పెరిగిన వరి దట్టంగా

పిలకలు వేసింది.

అట్లా నాలుగు నెలలు గడిచే సరికి పంటమొత్తం కంకులతో కళకళలాడింది.



దాంతో ఈసారి కోతల సుబ్బారాయుడుతో పంటని కోయించాడు రాఘవేంద్రరావు .

పడిన కష్టానికి ఫలం దక్కి , పంటంతా క్షేమంగా ఇంటికి చేరుకున్నది. పంట దిగుబడి అధికంగా ఉండటంతో దానికి ఒక మంచి రేటు కూడా వచ్చింది.

రైతుగా రాఘవేంద్రరావు సంతోషించాడు . విత్తనాల విజయమ్మ, నాట్ల నాగమ్మ , చీడపీడల చింపిరయ్య, సత్తువ సత్తెయ్య , కోతల సుబ్బారాయుడు అందరూ తమకు పని దొరికినందుకు సంతోషించారు.

క్రూరమైన రసాయనాలు చల్లకుండా, చక్కని ఎరువులిచ్చి తనని ప్రేమగా కాపాడుకున్నందుకు నేలతల్లి కూడా మురిసింది.

**ఆశ వీడకు!**

వెంగళప్ప ఓసారి జామకాయలు కొంటే అందులో పురుగులు వచ్చాయి.
వెళ్ళి జామకాయల అతన్ని నిలదీశాడు: "నువ్వమ్మిన పళ్ళలోంచి పురుగులు వచ్చాయి!" అని.
పండ్లాయన అన్నాడు: "ఎవరి అదృష్టం ఎలా ఉందో ఏమి చెప్తాం సర్, పురుగులు వస్తే పురుగులు వస్తాయి, మోటార్ సైకిళ్ళు వస్తే మోటార్ సైకిళ్ళు వస్తాయి" అని.
వెంగళప్పకు ఆశ పుట్టింది: "అవునా! అట్లా ఐతే అర్జంటుగా ఇంకో ఐదు కిలోలు కట్టివ్వు! ఈసారి ఏమొస్తాయో చూడాలి!" అని మళ్ళీ కొనుక్కెళ్ళాడు.




# సొరకాయ కూర కథ

*రచన: భార్గవ్, 5 వ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, విజయవాడ.*

అనగనగా నది ఒడ్డున ఉండే ఒక ఊళ్ళో సీతమ్మ , రామయ్య అనే భార్యాభర్తలు ఉండేవాళ్ళు. వాళ్ళు చాలా పేదవాళ్ళు. రోజూ నదిలోకి దిగి చేపలు పట్టి , వాటిని తెచ్చి దక్కిన రేటుకు పట్నంలో అమ్ముకొనేవాళ్ళు.

రామయ్యకు, సీతమ్మకు సొరకాయ కూర అంటే చాలా ఇష్టం. ఒక రోజున రామయ్యకు సొరకాయ కూర తినాలనిపించింది. "ఇవాళ్ల సొరకాయ కూర చేసుకుందాం. నేను ఈ చేపలు ఇచ్చేసి, సొరకాయ తెస్తాను" అని, మూడు పెద్ద పెద్ద చేపలు పట్టుకొని పట్నం వెళ్ళాడు రామయ్య.

అయితే, ఆ రోజున సొరకాయలకు గిరాకీ ఎక్కువ ఉన్నది. సొరకాయల వాళ్లెవ్వరూ ఇతని చేపలు అక్కర్లేదన్నారు ! చేపలు అమ్మితే వచ్చే డబ్బు ఒక్క సొరకాయకు

కూడా చాలేట్లు లేదు!

దాంతో చిన్నబోయిన రామయ్య, తన చేపల్ని 'ఏం చేయాలా' అని ఆలోచించాడు. ఆ ఊరి రాజుకు చేపలంటే చాలా ఇష్టం . "తను చేపల్ని తీసుకెళ్ళి రాజుగారికి బహుమతి ఇస్తే, ఆయన సంతోషపడి, 'ఏంకావాలి?' అని అడుగుతాడు. అప్పుడు తను 'రెండు సొరకాయలు ఇప్పించండి , మారాజా!..' అంటాడు" అనుకొని, వాటిని తీసుకెళ్ళి రాజుగారి ముందు పెట్టాడు రామయ్య.

అయితే, ఆ రోజు యువరాణి పుట్టిన రోజు. అందరూ ఆ పాపకు ఏవేవో బహుమతులు ఇస్తున్నారు. రాజుగారు, యువరాణి చేపల్ని అయితే తీసుకున్నారు గానీ , బదులుగా రామయ్యకు ఏమీ ఇవ్వలేదు!

రామయ్య చాలా బాధపడ్డాడు . విచారంగా ఇంటికి బయలు దేరాడు . బయట ఉన్న కాపలావాళ్ళు అతని ముఖం చూసి , 'సంగతేంటి' అని అడిగారు. రామయ్య తన గోడంతా వెళ్లబోసుకున్నాడు.

"అయ్యో! ఎంత పనైంది! ఇవాళ్ళ ఆ పాప పుట్టినరోజు కదా , అందరికీ భోజనాలు పెడుతున్నారు. చూడు- అక్కడ సొరకాయ కూర వేస్తున్నారు! నువ్వు అక్కడే భోజనం చేసిపో, కనీసం ఆ కోరిక కొంతైనా తీరు – తుంది" అన్నారు వాళ్ళు.



రామయ్య పోయి, అందరితో బాటు భోజనం చేసాడు. సొరకాయ కూర చాలా బాగుంది! మూడు నాలుగు సార్లు వేయిం– చుకొని తిన్నాడు. తనకైతే తృప్తి అయ్యింది

గానీ 'సీతమ్మకి ఏమీ లేదే ' అనిపించింది అతనికి. కొంచెం కూర తీసి, తన గిన్నెలోకి వేసుకొని, లేచి వెళ్ళి చేయి కడుక్కున్నాడు.



బయట నిలబడి ఉన్నది రాజకుమార్తె. రామయ్య చేసిన పని చూస్తూనే ఉంది . అతన్ని పిలిచి, 'ఏంటి తీసుకెళ్తున్నావు?' అని అడగనే అడిగింది!

"నా భార్యకి సొరకాయ అంటే చాలా ఇష్టం.. తన కోసం కొంచెం కూర పెట్టించుకున్నాన–మ్మా" అన్నాడు రామయ్య , తన గిన్నె చూపిస్తూ.

ఆ పాప అతనికేసి ఒక క్షణం చూసి , నవ్వి "అంత ఇష్టమైతే ఒక సొరకాయే ఇప్పిస్తా –నుగా? ఆగు!" అని సేవకులతో చెప్పి , ఒక మంచి సొరకాయను తెప్పించి ఇచ్చింది ! అంతే కాక గిన్నె నిండా సొరకాయ కూర పెట్టి పంపించింది!

రామయ్య మబ్బుల్లో తేలిపోతున్నట్లు నడిచి, గబగబా ఊరు చేరుకున్నాడు . ఆరోజంతా సీతమ్మ, రామయ్య ఇద్దరూ రాజుగారు పెట్టిన సొరకాయ కూరని పొగుడుతూనే ఉన్నారు!

మరునాడు కూర చేద్దామని సొరకాయని కోస్తే, అందులోంచి టపుక్కున ఒక వజ్రం రాలి పడింది!

రామయ్య, సీతమ్మ యువరాణికి మరోసారి కృతజ్ఞతలు చెప్పుకున్నారు : 'వజ్రాన్ని అమ్మగా వచ్చిన డబ్బుతో భూమి కొని , సొరకాయల పంట వేద్దాం' అనుకున్నారు సంతోషంగా.



# పదాల్ని వెతికి పట్టుకోండి!

**మాయదీపం, విజయనగరం, సేనాపతి, రాజయ్య, గురువు, భారతీయుడు, కథలు, బతుకమ్మ, నిజం, దసరా, ముత్యాలు, ఆకాశంలో, రామచిలుక, పాప, పక్షవాతం, రచయిత, రాయలసీమ, పరోపకారం, అన్నమయ్య, వేమన.** **:-** *ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి - ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు* గీయండి!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ము | క | లు | చి | మ | రా | మ | పం | బ | గు | చి | యి |
| త్యా | అ | న్న | మ | య్య | జ | సీ | ద | య | రు | వే | జ |
| లు | వి | లు | ప | కా | య్య | ల | దీ | ప | వు | పా | రా |
| న | క | జ | ఆ | క్ష | బ | య | త్యా | తి | ప | నా | సే |
| రు | మ | మ | య | ల | వా | రా | మ్మ | ము | న | లు | క |
| డు | క | వే | చి | న | మ | తం | క | లో | శం | కా | ఆ |
| యు | ర | చ | యి | త | గ | జ | తు | థ | సే | ఆ | మా |
| తీ | బ | రు | మ | రా | కా | రం | బ | ర | లు | పా | య |
| ర | ద | ఆ | ని | పా | స | ప | రో | ప | కా | రం | దీ |
| భా | వి | జం | గ | రా | క | ద | చ | ని | రా | గు | పం |
| తీ | బ | రు | మ | రా | కా | రం | బ | ర | లు | పా | య |
| అ | ప | ఆ | శం | ద | ల | క | య | మ | ప | త్యా | ము |

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 11/02/2020 Postal Regn No: HDP/008/2018-2020

## కొత్తపల్లి గురించి ఓ పేజీ

పూర్వం ఒక రాజుగారికి ఉన్న నలుగురు కొడుకులూ అప్రయోజకులయ్యారట .... బహుశ: తండ్రిగారి క్రమశిక్షణ మరీ ఎక్కువైపోయిందేమో, వాళ్లకి ఏం చెప్పినా అర్థం కావట్లేదు . తల్లిదండ్రులూ, అమాత్యులూ, గురువులూ ఏం చెప్పాలని నోరు తెరిచినా వాళ్ల చెవులు మూసుకుపోతున్నాయి.. తెలివి తేటలకేమీ తక్కువ లేదు. ఉన్నదల్లా అప్రయోజకత్వమే.

చివరికి రాజుగారు విష్ణుశర్మ అనే పండితుడిని రావించి, ఆయన్ని గౌరవించి, తన కొడుకుల్ని చూపించి, "వాళ్లని మీరే తీర్చిదిద్దాలని వేడుకున్నారు.. విష్ణుశర్మ సరేనని వాళ్లని వెంటబెట్టుకెళ్ళారు.. ఆరు నెలల్లో వాళ్లు నలుగురూ ప్రయోజకులై తిరిగి వచ్చారు!

విష్ణుశర్మ వాళ్లమీద వ్యాకరణ శాస్త్రాలనూ, వేదమంత్రాలనూ, క్షత్రియోచిత యుద్ధ విద్యల్నీ రుద్దలేదు. పుస్తకాలు ముందు పడేసి చదవకపోతే ఊరుకోనని ఉరమలేదు. కథలు చెబుతూ పోయాడు. ఆ కథలే రాజుగారి కొడుకుల్ని ప్రయోజకుల్ని చేశాయి. నీతి చంద్రికగానూ, పంచతంత్రంగానూ పేరొందాయి.

కథలు, ఆటలు, పాటలు వృథాపోవు. వాటిలో పిల్లలకు వాళ్లదైన ఒక ప్రపంచం దొరుకుతుంది . ఆ ప్రపంచంలో స్వేచ్ఛగా రెక్కలార్చుకుంటూ తిరిగి, వాళ్లు ఇతర ప్రాపంచిక విషయాల్ని సునాయసంగా నేర్చుకుంటారు . కథలు, ఆట పాటలు సేద తీరుస్తాయి. సేద తీరిన మనసులు ఊరట చెంది, మంచి మనుషుల్ని తయారు చేస్తాయి. సమాజంలో శాస్త్ర విషయాల్ని లోతుగా నేర్వాలంటే మనుషులకు వాటి పట్ల మక్కువ అవసరం.. కళలు ఆ మక్కువని నిర్మిస్తాయి.

తెలుగు పిల్లలకు సంతోషాన్ని ఇచ్చేందుకుగాను మానవీయ స్పర్శ ఉన్న కథల్ని , ఆటపాటల్ని , విద్యా, విజ్ఞాన, వినోదాల్నీ పిల్లల స్వీయ దృక్పథంలో, బేషరతుగా అందించే ఉద్దేశంతో "కొత్తపల్లి" మీ ముందు నిల్చింది. పన్నెండు సంవత్సరాలుగా, వందకు పైగా సంచికలుగా, చాలా చాలా కథల్ని, పాటల్ని, బొమ్మలతో సహా అందరికీ అందుబాటులో ఉంచుతున్నది.

మీరు పిల్లలైతే, ఈ రచనల్ని, బొమ్మల్ని, పాటల్ని చదవండి, చూడండి, వినండి, ఆనందించండి. ఇలాంటివి మీకూ వచ్చి ఉంటాయి అనేకం. మాతో వాటిని పంచుకోండి. మీ రచనల్ని కూడా కొత్తపల్లి పత్రిక ప్రచురించగలదు . మీరు పెద్దలైతే, మళ్ళీ ఓసారి పిల్లల ప్రపంచంలోకి అడుగు పెట్టండి. వాళ్లకు నచ్చేవేవో చూడండి. మీ పిల్లలకు వీటిని చదివిపెట్టండి , వారిచేత చదివించండి, వాళ్లకు వినిపించండి, మీరూ ఈ పాటలు పాడుకోండి. మీలోని సృజనకూ పదును పెట్టండి. పిల్లలకు పనికొచ్చే రచనలు ఏమైనా ఉంటే మాకు పంపండి. స్నేహ హస్తాన్నందించండి, మీకు చేతనైన సాయం చేయండి..

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.